C RMR01A138

శ్రీః

# శ్రీత్రిపురామహిమ్నస్తోత్రమ్

(శ్రీదుర్వాసమహాముని విరచితమ్)



'శ్రీ నీరాజన' (ఆంధ్ర వ్యాఖ్య)

మేళ్ళచెర్వు వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రి

ప్రకాశకులు

సాధన గ్రంథ మండలి, తెనాలి

1 RMR01A138

శ్రీః

# శ్రీత్రిపురామహిమ్నస్తోత్రమ్

(శ్రీదుర్వాసమహాముని విరచితమ్)



'శ్రీ నీరాజన' (ఆంధ్ర వ్యాఖ్య)

మేళ్ళచెర్వు వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రి

ప్రకాశకులు

సాధన గ్రంథ మండలి, తెనాలి

శ్రీత్రిపురా మహిమ్న స్తోత్రమ్
శ్రీనీరాజన(ఆంధ్ర వ్యాఖ్య) - మేళ్ళచెర్వు వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రి
సంస్కృతాధ్యాపకుడు, గోరంట్ల వెంకన్న సంస్కృతాంధ్ర కళాశాల,
తిమ్మసముద్రము.

ప్రథమ ముద్రణ : శ్రీకృష్ణజయన్తి- అగస్టు15, 2001,
ప్రతులు : 1000
వెల : రూ. 15/-

సర్వస్వామ్యములు : 1.మేళ్ళచెర్వు వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రి
2. సాధన గ్రంథ మండలి, తెనాలి - 522 201
3. రావి మోహనరావు
4. అష్టాదశ శక్తి పీఠములు

All Rights Reserved
No part of this book may be reproduced, stored in a retrieval system or trans-mitted in any form or by any means, or translated, without the prior permission in writing of R. MOHANA RAO nor be otherwise circulated in any form of binding or cover other than that in which it is published and without a similar condition including this conditon being imposed on the subsequent purchaser.

*THIS BOOK, PUBLISHED WITH THE FINANCIAL ASSISTANCE OF MAKKENA AJAY CHANDRA, IS PLACED TO THE LOTUS FEET OF SRI BRAMARAMBIKA MALLIKARJUNA SWAMY OF SRISAILAM.*

DTP by
R. MOHAN RAO
4-103, I.L.T.D. Colony
Kothapeta, Chirala - 523 157
Ph: 34054

Printed at
SRI VIJAYALAKSHMI OFFSET PRINTERS
NAAZ COMPLEX
Chirala - 523 157
Ph : 33057

# చేతనాచిలిమిలికలు

'శ్రీనీరాజన'యన్న వ్యాఖ్య యిది శ్రీసింహాసనేశీ రహః
శ్రీరాజ్యంబును శక్తి మేఱకు, బ్రపంచింపంగ, నేనెంచితిన్
ఏరూపంబున దప్పు దొర్లినను , తల్లీ! దాని మన్నించి యీ
ప్రారంభంబు ననుగ్రహించి నను 'సుబ్రహ్మణ్యగా జూడవే'

ఆదిమధ్యాన్తగురువుల నాదరించి,
మౌని దుర్వాసు పాదపద్మముల కెఱగి
శక్తియున్నంత మేఱకు భక్తితోడ
త్రిపుర మహిమను వివరింతు తెలుగులోన.

'రావి' జ్ఞానమ్మునకు గుర్తు 'రావు' మనకు
మోహనుడు గుర్తు ఆ జగన్మోహనునకు,
రెండు'రావుల' మధ్యలో నుండినట్టి
'మోహనుడు'గోర నీ 'టీక'మొదలు సూపె.

లోకమున 'అండపిండబ్రహ్మాండములు' - అను వ్యవహారము గలదు. ఈ వ్యవహారమునకు అర్థము యోగశాస్త్రము చెప్పగలదు. అండమునందు ఏమిగలదో అదే పిండాండమున విస్తరించి నేత్రగోచర మగును. పిండాండము నందు ఏమిగలదో అదే బ్రహ్మాండమున విస్తరించి దృశ్యము కాగలదు. కనుక ఈ 'అండ పిండ బ్రహ్మాండముల మధ్య' వికాస సంబంధము గలదు. 'పర సూక్ష్మ స్థూల' దశులు గలవు. కాగా, తేలిన సారాంశము:- మన శరీరము అను పిండాండమున బ్రహ్మాండమంతయు ఇమిడియున్నది. ఇట్టిదే

'గవామంగేషు తిష్ఠన్తి - భువనాని చతుర్దశ' - అనుమాట.

ఇది సర్వయోగతంత్రపురాణములందు ప్రహితమైన విషయమే.

'దేహేఽస్మిన్ వర్తతే మేరుః సప్తద్వీప సమన్వితః
సరిత స్సాగరాశ్శైలాః క్షేత్రాణి క్షేత్రపాలకాః

ఋషయో మునయ స్సర్వే నక్షత్రాణిగ్రహాః తథా
పుణ్యతీర్థాని పీఠాని వర్తంతే పీఠ దేవతాః
సృష్టిసంహారకర్తారౌ భ్రమంతౌ శశిభాస్కరౌ
నభో వాయుశ్చ వహ్నిశ్చ జలం పృథ్వీ తథైవ చ
జానాతి య స్సర్వం సయోగీ నాత్ర సంశయః।

- శివసంహితా

ఈ లోకములే కాక లోకాధిదేవతలు గూడా మన శరీరమునందే గలరని శాస్త్రవాక్యము. త్రిలోకాత్మకమైన ప్రణవము,నాదాత్మకమైన కుండలిని, పరబ్రహ్మము, ఈశ్వరుడు, సదాశివుడు, త్రిమూర్తులు, మన శరీరమునందే గలరు. రేడియోనందు స్టేషన్స్ ఉన్నట్లు ఇదంతయు సుషుమ్న అను 'వేవ్' లో మనకు తారసపడును. కాని, అట్టి 'వేవ్' ను అందుకొనగల్గుట అవసరము. లేనిచో ఏమి ఉన్నను మనకు ఉపయోగములేదు. అంగటిలో ఏమి ఉన్నను అల్లున కేమి ప్రయోజనము. దీనికే సాధన అవసరము. అదే ఉపాసన.

'గవాం సర్పిః శరీరస్థం నకరోత్యంగపోషణమ్।
నిస్సృతం కర్మసంయుక్తం పునస్తాసాంతదౌషధమ్॥' సౌ।భా।

అనగా, ఆవు నేయి ఆవు శరీరమునందే కలదు. కాని దానికి ప్రయోజనము లేదు. కాని ఆ నేతిని బయటకు తీసి ఔషధాలతో సంపుటీకరించి పెట్టినచో వాతదోషము మొదలగునవి నశించును.

'ఏవం సహి శరీరస్థ సర్పివత్ పరమేశ్వరః
వినాచోపాసనాదేవ నకరోతి హితం నృషు' - సౌ।భా।

అట్లే చైతన్యరూపముగా నాదరూపముగా కాల రూపముగా వ్యాప్తుడైన పరమేశ్వరుడు మన శరీరములందు అంతర్యామిగానున్నను 'ఉపాసన - అనుక్రియలేనిదే మనకు హితమును చేయడు' అని తాత్పర్యము. కనుక మోక్షము కోరినచో ఉపాసన ఆవశ్యకము.

**ధ్యేయ రూపము:** బ్రహ్మము 2 విధములుగా ఉపాస్యము.

1. నిర్గుణ బ్రహ్మను జ్ఞానరూప ఉపాసనతో పొందుట.

2. సగుణ బ్రహ్మను లేదా సరూప దేవతలను తంత్రాదిక సహాయముతో ఉపాసించుట.

ఈ 2వ ఉపాసనలో అనేక విధములు గలవు. ప్రధానముగా దేవుని స్త్రీగా సేవించుట లేక పురుషునిగా సేవించుట అనునవి 2 పద్ధతులు. దేవిగా మాతగా సేవించుటకు కారణములు ఇట్లున్నవి.

1) పరబ్రహ్మము అందనిది. అందువలన ఉపాసన సాధ్యముకాదు.

2) మాయ బ్రహ్మ సంకల్పశక్తి మనలను సృజించినది కనుక సృష్టి శక్తి. ఆమె ఆయుధములు లేక సాధనములు అన్నియు కామాది సృష్టి హేతువులు. సృష్టికి అభిముఖురాలు ఆబాలగోపవిదితురాలు. కనుక మనకు అందుకొన దగినది.

3) భావనను బట్టి భగవంతుడు రూపధారియై మనకు అనుగ్రహము చూపును.'భావన' కు ఈ శక్తి లేనిచో ఇన్ని మతములు, మంత్రధ్యానములు కల్లలు కాగలవు. భావన ముఖ్యము కనుక దేవుని దేవిగా, మాతగా భావించిన చో మాతృత్వము వహించి దేవుడు కనికరింపగలడు. మాతృత్వము కోమలం. పితృత్వము కఠినము. కనుక కోమల దేవతా సేవ వలన త్వరగా భద్రముగా ఫలితము రావచ్చును.

'పిత్రా నిర్భర్త్సితో బాలో మాత్రైవాశ్వాస్యతే కిల' - సౌ।భా।

అనగా తండ్రితో తన్నులు తిన్నవానికి తల్లి శరణ్యము. కనుక ముందుగా తల్లినే ఆశ్రయించుట క్షేమమని తాత్పర్యము.

4) ఎంతటి జ్ఞానియైనను ప్రకృతి బంధములు వీడనిదే ప్రకృత్యతీత వస్తువును కనుగొనలేడు. సన్యాసమునకు తల్లి అనుమతికాని భార్య అనుమతికాని కావలయును అని ధర్మము. అట్లే ప్రకృతి నుండి పురుషోత్తముని వద్దకు చేరుటకు 'ప్రకృతియే' అనుమతింపవలయును. అట్టి పరిస్థితిలో ప్రకృతినే మాతగా సేవించినచో మనను ఆమెయే ముక్తులనుగా చేయును. ఆవరణము వీడ వలయునన్నచో ఆవరణశక్తి సహాయము అవసరమే కదా.

5.కనుక 'దేవి'గా ఉపాసించుట మేలని కొందఱు శక్తి పూజకు ఇష్టపడిరి. అయినను ఇచ్చట మఱొక ప్రశ్నగలదు. మాయ అనగా శూన్యము గదా. ఉపాసనార్హత ఎట్లు? సమాధానమేమనగా,

'మాయ' అనగా త్రిగుణాత్మక సృష్టిశక్తి. ఈ జడపదార్థమును సేవింపుమని గాదు. మాయయందుండి మాయను నడిపించు చైతన్యమును సేవింపుమని అర్థము. 'స్త్రీ' అనగా చీర కట్టిన శరీరము మాత్రమే కాదు. అందలి 'ఆత్మయే' కదా. అట్లే మాయాధిష్ఠాన చైతన్యమైన బ్రహ్మోపాసనయే దేవీ సేవ. అనగా మాతృత్వగుణోపహితమైన ఈశ్వరచైతన్యమును సేవించు చున్నాము అని అర్థము.

'నాహం సుముఖి మాయాయా ఉపాస్యత్వం బ్రువే క్వచిత్।
మాయాధిష్ఠాన చైతన్యం ఉపాస్యత్వేన కీర్తితమ్ ॥'
-కౌలోత్తర తంత్రము.

ఉపాసనలలో-కౌలాచారము, సమయాచారము అనునవి 2 గలవు. కౌలాచారములో బాహ్యయోనిపూజ మొ॥ ఉన్నవి గనుక, నిషిద్ధము. సమయాచారము వేదశాస్త్రనియమములకు లోబడి నడుచు సేవా తంత్రము. కనుక సర్వసమ్మతము.

ఉపాసనలో అభేదోపాసన ముఖ్యముగా చెప్పబడినది. ఈ విషయములో కౌలతంత్రములు గూడ భేదించుటలేదు. దేవత వేఱు తాను వేఱు అను భావనను పశుభావనగా నిందించుచున్నారు.

'సదానందపూర్ణా స్వాత్మైవ పరదేవతా లలితా' - భావనోపనిషత్తు
'ఉపాస్తేః పరమంఫలం ఉపాస్యాభేదః॥' - సౌ।భా।

***కుండలిని:*** సర్వోపాసనలకు ప్రధానము కుండలిని. ఈమె పరాశక్తియే. జ్ఞానశక్తియే. నాదశక్తియే. ప్రణవశక్తియే. ఈమె 2 విధములు

1) సూర్య కుండలిని 2) అగ్ని కుండలిని

సూర్య కుండలిని సహస్రారబిందువు నందలి పరాశక్తియే. ఆమెయే చతుర్దశ

భవనస్సృష్టి ప్రారంభించి పిండాండ బ్రహ్మాండములందు వ్యాపించి క్రిందికి దిగి సృష్టి ముగించి మూలాధారమున స్వయం భూలింగమును 3.5 చుట్లతో పరివేష్టించి నిద్రించునని యోగశాస్త్రము. ఈ శక్తిని కదలించుటకు వేదశాస్త్ర తంత్రములు అన్నియు పాటుపడు చున్నవి. జ్ఞానయోగమందు ఈ జ్ఞానశక్తి కదలవలెను. మంత్రయోగమందు ఈ నాదశక్తి స్పందించవలెను. భక్తియోగ మందు ఈ మనశ్శక్తి కంపించవలెను. ఇన్నియేల? ఏమతమునందయినను, ఏతంత్రమందయినను, ఈ కుండలినీ స్పందనము లేనిచో వ్యక్తికి ముక్తిలేదు. ఈకుండలినిని కదలించుట సులభము కాదు. పాపములన్నియు హరింప వలెను. లేనిచో కదలినను అపాయకరము కావచ్చును. ఇది జడము కాదు. జ్ఞానశక్తి. కనుక శుద్ధుడయిన వ్యక్తికి ఇది సాధ్యము.

'మూలపద్మే కుండలినీ యావన్నిద్రాయితా ప్రభో।

తావత్ కించిత్ నసిద్ధ్యేత మంత్రతంత్రార్చనాదికమ్॥''

'జాగర్తి యది సా దేవీ బహుభిః పుణ్యసంచయైః।

తదా ప్రసాద మాయాతి మంత్రయంత్రార్చనాదికమ్।''

ఈ కుండలిన్యుత్థాపనమునకు కౌలులు కుండలినీ స్థానమైన మూలాధార స్వాధిష్ఠానములకు యోనిప్రాంతమున బాహ్యపూజ గావించెదరు. ఇట్టి పూజలు సామాన్యులకు హానికరముగాన తంత్ర విషయములు చాలా గోప్యము గా వ్రాయబడును. చాలా విషయములు సంప్రదాయముగల గురువునుండి తెలిసికొనవలయును.

'కల్యర్థం సర్వతంత్రేషు య స్సార స్స తు గోపితః॥ '- మేరుతంత్రము

ఒకసారి ఈ జిజ్ఞాస ఏర్పడిన తరువాత, అది త్వరగా నశించదు. మఱింత వృద్ధి పొందును. జన్మాంతరములందును వెంబడించును.

'సర్వా ఏవ కలా జంతోః అనభ్యాసేన నశ్యతి।

ఇయం జ్ఞానకలాత్వంతః సకృజ్జాతాపి వర్ధతే॥'- యోగవాసిష్ఠము.

కనుక నిప్పురాజేసినట్లు ఒక్కసారి యీ జ్ఞానకలను వెలిగించినచో

అది అఖండ దీపమగునంత వఱకు ఆరిపోవదు. కనుకనే భగవద్గీతలో 'బహూనాం జన్మనా మన్తే జ్ఞానవాన్ మాం ప్రపత్స్యతే' అని చెప్పబడెను.

**మంత్రవిద్య:**

మంత్రములు వేద మంత్రములు ఆగమమంత్రములు అని 2 విధములు. ఆగమమంత్రములు బీజమంత్రములు, వాక్యమంత్రములు ఉభయ మంత్రములు ఉండును. అందు బీజములున్న మంత్రములు సంకేత మంత్రములు. మంత్రవర్ణములు బీజములయినను పదములయినను, ఉపాస్యదేవతారూపమును బోధించును. మంత్రమును దేవతాశరీరము అందురు.

'జ్ఞాపకం దేవతాదీనాం య ద్బీజ మక్షర ముచ్యతే' - అని వాక్యము మఱియు,

మంత్రాణాం చింతనాత్ దేవి స మనుః దేవతా స్వయమ్
ధ్యానేన దర్శనం దత్వా పునర్మంత్రేషు లీయతే.

అనియు వచనము

అర్థము: మంత్రమే దేవత. మంత్రచింతనవలన మంత్రమే దేవతగా ప్రత్యక్షమై తరువాత మరల మంత్రవర్ణములలో లీనమగును.

యజ్ఞ యాగాదులందును దేవతను గూర్చి 'చతుర్థ్యంతః శబ్దో దేవతా' అనియే చెప్పిరి. ఇంద్రాయస్వాహా, ఈ మంత్రమే ఇంద్ర స్వరూపము అని యర్థము.

ఇట్టి సంకేత విద్యలలో శ్రేష్ఠతమము సంకేతసార విద్య అను నామాంతరముగల శ్రీవిద్య. ఇందు దేవియొక్క సృష్ట్యతీత స్వరూపము నుంచి సృష్టిరూపమువఱకు మంత్రమున న్యాసము చేయబడినది. అదియే శ్రీచక్ర రూపమున న్యాసము చేయబడినది. కనుకనే ఆగమశాస్త్రమున 'చక్రసంకేతకో మంత్ర పూజాసంకేతకామితి త్రివిధః త్రిపురాదేవ్యాః సంకేతః పరమేశ్వరి' అని సంకేతత్రయము దేవీ రూపముగా చెప్పబడినది.

**పంచదశి - షోడశి:**

ప్రధానముగా 15 అక్షరములగల విద్య, దీనికి 'ఈం' లేదా 'శ్రీం' కలిపిన 'షోడశి' అగును. దీనిని గూర్చి విషయములు దీనియందలి ఖండత్రయము అక్షరములు ఆయా శ్లోకముల వద్ద వ్యాఖ్యానమున ఈయబడినవి. అందువలన అచ్చటనే చూడవలయును.

**శ్రీ విద్యోపాసకులు**

కాదివిద్యకు మన్మథుడు ఋషి. ప్రథమ ఉపాసకుడు. ఆనంద భైరవుడు అను నామము మన్మథునిదే.

***'ఆనందఃకర్దమశ్చైవ చిక్లీత ఇతి విశ్రుతాః'*** - శ్రీసూక్తమ్

మఱియు, అరుణోపనిషత్‌లో

''పుత్రో నిర్ఋత్యా హ వైదేహః అచేతా

యశ్చ చేతనః స తం మణి మవిందత్''

అనగా నిర్ఋతి= లక్ష్మి. ఆమెపుత్రుడు విదేహుడు అనగా అనంగుడు వాడు ఆ మణిని= అనగా పంచదశిని పొందెను.

మఱియు కామక్రోధాదులు దేవీశక్తులలోనివారు.

కామక్రోధలోభమోహమద మాత్సర్య పుణ్యాపాపమయ్యో బ్రాహ్మ్యాద్యష్టశక్తయః

- భావనోపనిషత్తు

వరాహ పురాణములో గూడా

'కామం యోగీశ్వరం విద్ధి క్రోధం మాహేశ్వరం తథా

లోభస్తు వైష్ణవ ప్రోక్తా బ్రహ్మాణీ మద ఏవచ

మోహః స్వయంభూః కల్యాణి మాత్సర్యం చేంద్రజాం విదుః

యమదండధరా దేవీ పైశున్యం స్వయమేవచ

అసూయాచ వరాహాఖ్యా అష్టైతాః మాతృకాః స్మృతాః'

-వరాహ పురాణమ్

ఈ విధముగా కామక్రోధాదులు దేవీ సాధకులు, సాధనములు గూడా. సౌభాగ్య

భాస్కరమునందు 12 మంది ఉపాసకులను వర్ణించు శ్లోకము గలదు. చూ॥

'మనుశ్చంద్రః కుబేరశ్చ లోపాముద్రాచ మన్మథః
అగస్తి రగ్నిః సూర్యశ్చ ఇంద్రః స్కంధః శివస్తథా,
క్రోధభట్టారకో దేవ్యాః ద్వాదశాద్యా ఉపాసకాః'

ఇందలి క్రోధభట్టారకుడు ప్రస్తుత త్రిపురామహిమ్నః స్తవ రచయిత మన దుర్వాసుడు.

ఈ మహాత్ముని స్తోత్రమును వ్యాఖ్యానించుటకు నాకు గల అర్హత శూన్యము. అయినను, నాకు సాధ్యమైనంతమేఱకు ఈ కార్యక్రమమును నెరవేర్చితిని. ఈ స్తోత్రము సామాన్యులకు అర్థమగుటయే లక్ష్యము. అది నెరవేరినచో నా కృషి ఫలించినట్లే.

అగస్త్యరచితమైన 'శ్రీవిద్యాదీపిక' అను గ్రంథమునుండి శ్రీవిద్యా మంత్రార్థమును సులభజ్ఞానమునకై ఇచ్చుట వ్రాయుచుంటిని.

౧). **ప్రథమఖండము**- వాగ్భవఖండము- సకలవిద్యాప్రదాయకము.

స్వరూపము-'**క ఏ ఈ ల హ్రీమ్**'- అక్షరములు 5

| అర్థవివరణ | వ్యుత్పత్తి వివరణ |
|---|---|
| క- ప్రకాశము | కన్ ధాతువు |
| ఏ- స్మరణము, అధ్యయనము | ఇన్, ఇజ్ ధాతువు |
| ఈ- వ్యాపించుట | ఈ ధాతువు |
| లహ్రీ- లహరికి పరోక్షరూపము. | ప్రవాహము, ఆధిక్యము |
| మ్- బోధించుట, శబ్దించుట | మా ధాతువు. |

ఈ సంకేతము లన్నింటి యొక్క అర్థములను కలిపినచో ప్రకాశమానమైన బుద్ధివ్యాప్తి ప్రవాహములను బోధించునది. లేదా, ప్రకాశవిమర్శములను శివశక్తితత్త్వముల ప్రవాహములను బోధించునది అని అర్థము చెప్పవచ్చును. ఇది ఇష్టదేవతాస్తుతిపరము గనుక ఋగ్వేదముతో సమానము. ధీ ప్రబోధనము గూర్చి చెప్పబడినది కనుక గాయత్రీ సమము. ఇది దేవికి ముఖ పంకజము.

౨). ద్వితీయఖండము-కామరాజఖండము-సకలభోగప్రదాయకము

స్వరూపము-'హ స క హ ల హ్రీమ్'-అక్షరములు 6

| సంకేతము | అర్థవివరణ | వ్యుత్పత్తి వివరణ |
|---|---|---|
| హ | పోగొట్టునది, హింసించునది | హన్ |
| స | సమాప్తి చేయునది | షో |
| క | కామములు, వాంఛలు | హోజ్ |
| లహ్రీ | లహరికి పరోక్షరూపము | ప్రవాహము, ఆధిక్యము |
| ఈ | వ్యాపించు | ఈ ధాతువు |
| మ్ | బోధించుట | మా |

ఈ అర్థములను కలుపగా వచ్చు తాత్పర్యము-హింసించువాటిని అంత మొందించు సకలభోగములను ఇచ్చు దయా ప్రవాహవ్యాప్తి అను అర్థము వచ్చును. 'హ్రీ+ఈ' చేయుటవలన 7అక్షరములు అగును. అందువలన ఇదే 'షోడశీవిద్య' అగును.

దేవత వలన ఆపదలు పోవుట, సకల కామములు నెరవేరుట అను విషయములు చెప్పబడినవి కనుక కామరాజఖండము. అభీష్టసాధన విషయములు చెప్పబడినవి గనుక ఇది యజుర్వేదముతో సమానము. ఇది దేవికి కంఠమునుంచి నడుము వఱకు గల భాగముతో సమానము.

3) తృతీయఖండము-శక్తిఖండము-సకలప్రపంచరూపము

స్వరూపము-స క ల హ్రీమ్- అక్షరములు 4

| సంకేతము | అర్థవివరణ | వ్యుత్పత్తి వివరణ |
|---|---|---|
| స క ల | కలలతో గూడిన | కలాసహిత |
| హ్రీ(హ్ర+ఈ) | హరించు, సంహరించు | హృఞ్ |
| | ఈ-పొందు, ఆత్మగమనము | ఈ- ధాతువు |
| మ్ | 'మ'కారాత్మకమైన నాదము. | |

ఈ సంకేతార్థములను కలుపగా వచ్చిన తాత్పర్యము-

౧. సకల ప్రపంచములను హరించి ఆత్మను పొందించు 'నాదశక్తి' లేదా,

౨. సకల సంహరణ సకలసృష్టిశక్తి అని అర్థము. ఇది నాదబోధకము గనుక

సామవేదముతో సమానము. సకలసృష్టి సంహారసమర్థురాలుగా చెప్పబడినది గనుక శక్తిఖండము. ఇది దేవికి కటినుంచి పాదాంతమువఱకు గల అధోభాగము. మఱొక్కమాట-

ఇచట అక్షరములు అర్థములకు సంకేతములుగా నిలచినవి. అనగా, 'క' అనగా ప్రకాశము, వాంఛ - ఇలా . ప్రశ్న ఏమనగా, అక్షరమునకు ఇంత అర్థము వచ్చునా? 'వచ్చును' అని సమాధానము.

౧. ఏకాక్షరనిఘంటువు ప్రకారము ఒక్క అక్షరమే అర్థము నీయగలదు. ఖం= ఆకాశము మొ॥.

౨. అసలు భాష అంతయు సంకేతమే గదా. అనగా, ఈ పదము ఈ వస్తువు సంబోధింపవలెను అని మనము ఏర్పరచుకొన్న ఒక గుర్తు. లేనిచో శబ్దమునకు అర్థమునకు ఏమి సంబంధము. అట్లే అర్థ సంకేతముగా మంత్రశాస్త్రము అక్షరములను స్వీకరించినది.

౩. ఈశ్వరేచ్ఛయే సంకేతమన్నచో మంత్రశాస్త్రమంతయు ఈశ్వర ప్రోక్తమే. కనుక బీజముల విషయములో ఈశ్వరేచ్ఛ పుష్కలముగా నున్నది.

ఇట్లు,
మేళ్ళచెర్వు వేఙ్కటసుబ్రహ్మణ్యశాస్త్రి
సంస్కృతాధ్యాపకుడు,
గోరంట్ల వెంకన్న సంస్కృతాంధ్ర కళాశాల,
తిమ్మసముద్రము.

శ్రీః

# త్రిపురా మహిమ్న స్తోత్రమ్

## (శ్రీదుర్వాసో విరచితమ్)

## శ్రీనీరాజన- ఆంధ్ర ప్రతిపదార్థ భావ విశేష యోజన

**(శ్రీ మేళ్ళచెర్వు వేఙ్కట సుబ్రహ్మణ్య శాస్త్రి)**

**అవతారిక:-** త్రిపురా మహిమ్నః స్తవకర్త అయిన దుర్వాస మహాముని ఈ శ్లోకమున శ్రీదేవతను దేవతారూపమున, మంత్రవిద్యా రూపమున, రెండు విధములుగా స్తుతించెను.

శ్లో॥ శ్రీమాత స్త్రిపురే పరాత్పరతరే దేవి త్రిలోకీ మహా
సౌన్దర్యార్ణవ మన్థనోద్భవ సుధా ప్రాచుర్య వర్ణోజ్జ్వలమ్।
ఉద్యద్భాను సహస్ర నూతన జపాపుష్ప ప్రభం తే వపుః
స్వాన్తే మే స్ఫురతు త్రిలోక నిలయం జ్యోతిర్మయం వాఙ్మయమ్॥ ౧

**ప్రతిపదార్థము:** దేవతాపరముగా

త్రిపురే- పురత్రయస్వరూపముగలదానా, పరాత్- పరము కన్న, పరతరే- అతీతమయినదానా, దేవి- దేవీ, శ్రీమాతః- శ్రీమాతా, త్రిలోకీ- ముల్లోకముల యొక్క, మహాసౌన్దర్య-గొప్ప సౌందర్యము అనే, అర్ణవ- సముద్రము యొక్క, మన్థన-చిలుకుట వలన, ఉద్భవ- పుట్టిన, సుధాప్రాచుర్య- అమృతసమూహము యొక్క, వర్ణ- రంగువలె, ఉజ్జ్వలమ్-వెలుగుచున్నదియు, ఉద్యత్-ఉదయించుచున్న, భానుసహస్ర-వేయి సూర్యులయొక్కయు, నూతన- క్రొత్త, జపా పుష్ప -ఎఱ్ఱమందారములయొక్క, ప్రభమ్- కాంతివంటికాంతిగలదియు, త్రిలోక -ముల్లోకములకు నిలయమ్- నివాసమైనదియు, జ్యోతిర్మయమ్ -సూర్య అగ్ని చంద్ర స్వరూపమైనదియు, వాఙ్మయమ్- పరా, పశ్యన్తీ, మధ్యమా, వైఖరీ రూపమైనదియు అగు, తే- నీ, వపుః- శరీరము, మే- నా, స్వాన్తే- మనస్సు నందు, స్ఫురతు- ప్రకాశించుగాక!

**తాత్పర్యము:** దేవతాపరముగా

శ్రీమాతా!, త్రిపుర స్వరూపురాలా! త్రిపురా శక్తీ! త్రిపుర సున్దరీ! సూక్ష్మాతి సూక్ష్మరూపురాలా! ముల్లోకములందు విస్తరించిన ప్రకృతి సౌందర్యమును మథింపగా వచ్చిన అమృతనవనీతమే నీ స్వరూపము. ఉదయ సూర్యునివలె నూతన మందార పుష్పములవలె అరుణవర్ణమయినది నీ శరీరము. నీ స్వరూపము నందే త్రిలోకములు పుట్టును గిట్టును. నీ స్వరూపము కాంతి మయము, వాఙ్మయము. అట్టి నీ దివ్యస్వరూపము మా మనస్సుల యందు నిత్యము స్ఫురించుగాక!.

**ప్రతిపదార్థము:** మంత్రవిద్యాపరముగా

శ్రీ-శ్రీం బీజము, మా-మాయాబీజము అయిన 'హ్రీం', అతః-దాని తరువాత, త్రిపురా-మూడు బీజములుగల బాల, మూడు కూటములుగల పంచదశి, ఈః( త్రిపురా+ఈః= త్రిపురే)-శక్తి ప్రణవమగు 'ఈం', పరాత్- పరమైన మాయాబీజముకన్న, పరతరే-పరమయిన 'శ్రీం' బీజము గలదానా! దేవి-దేవీ!, త్రిలోకీ-మూడుకూటములందలి, మహా సౌందర్య -సౌందర్య రూపమైన సౌః బీజము అనే, అర్ణవ-సముద్రముయొక్క, మంథన- చిలుకుట వలన, ఉద్భవ- పుట్టిన, సుధాప్రాచుర్య- అమృత మయమయిన, వర్ణ-బీజమైన ఐంకారముతో, వాగ్భవకూటముతో, ఉజ్జ్వలమ్- ప్రకాశమానమయినదియు, ఉద్యత్- ఉదయించుచున్న, భానుసహస్ర-కిరణ సహస్రము గలదియు, నూతన-నవీనమైన, జపాపుష్ప- మందారపుష్పము యొక్క, ప్రభమ్-కాంతి వంటి ఎఱ్ఱనికాంతి గలదియు, అనగా సృష్టిమూలమైన క్లీం బీజము గలదియు, మధ్యకూటము గలదియు, స్వాన్తే-తనయొక్క అంత్య భాగమున, మే (మా+ఈ)-శ్రీం బీజము గలదియు, ఈ-ఈం అను శుద్ధ కామకలా బీజముగలదియు అగు, తే-నీ, వపుః-శరీరము అనగా మహావిద్యా షోడశాక్షరూ రూపము, స్ఫురతు- స్ఫురించు గాక!

**తాత్పర్యము:** మంత్రవిద్యాపరముగా

పంచదశీ మంత్రము 3 భాగములు. వానినే 3 కూటములు అందురు.

౧. వాగ్భవకూటము-౫ బీజములు-దేవీ ముఖముతో సమము.

౨. మధ్యకూటము-౬ బీజములు-కంఠమునుంచి కటివఱకు ఉన్న దేవీ శరీరముతో సమము. దీనినే కామరాజకూటము అందురు.

3. శక్తికూటము-౪ బీజములు-కటినుంచి పాదాంతము.

ఇవి త్రిపురములు, త్రిలోకములు అనియు చెప్పబడును. అణువునుంచి విశ్వము వఱకు ఈ 'త్రి' తత్త్వము వ్యాపించియుండును. కాగా, సారాంశము- మూడు విభాగములుగల ఈ మంత్రమే నీ స్వరూపము. త్రిలోక సౌందర్య మంతయు నీ మంత్రమున సంకేతరూపముగా ఇమిడి యున్నది. ఈ వర్ణస్వరూపము అమృతమయము, కాంతిమయము, వాఙ్మయము. తల్లీ, అమృతవర్ణమయిన వాగ్భవకూటము నీ ముఖము. మందార సిందూర వర్ణమైన కామరాజ కూటము నీ శరీరమధ్యము. 3 లోకములకు, సకల కాంతులకు సారస్వతము నకు మూలమయిన శక్తికూటము నీ క్రింది శరీరభాగము. ఇట్లు మంత్ర సంకేత లభ్యమయిన నీ విద్యాశరీరము నా మనసులో ఎల్లప్పుడు నిలుచుగాక!

**సంకేతవివరణము**

౧. త్రిపురములు- 1. త్రిలోకములు- భూః భువః సువః అనునవి.

2. త్రిపుటి- జ్ఞానము, జ్ఞాత, జ్ఞేయము అనునవి.

3. స్థూల సూక్ష్మ కారణ శరీరములు.

4. శరీరములోని 3 భాగములు

5. మంత్రములోని 3 భాగములు.

౨. 'పరా పశ్యన్తీ మధ్యమా వైఖరీ-ఇవి నాదములో, వాక్కులో భేదములు. వీనిని గురించి యోగశిఖోపనిషత్తులో ఇట్లు చెప్పబడినది.

అక్షరం పరమోనాదః శబ్దబ్రహ్మేతి కథ్యతే
మూలాధారగతాశక్తిః స్వాధారా బిందురూపిణీ

తస్యా ముత్పద్యతే నాదః సూక్ష్మబీజాదివాంకురః
తాం పశ్యన్తీం విదుర్విశ్వం యథా పశ్యన్తి యోగినః
హృదయే వ్యజ్యతే ఘోషః గర్జత్పర్జన్య సన్నిభః
తత్ర స్థితా సురేశాన మధ్యమేత్యభిధీయతే
ప్రాణేన చ స్వరాఖ్యేన ప్రథితా వైఖరీ పునః

అనగా, నాదము శబ్దబ్రహ్మ. మూలాధారమునందు కుండలినీశక్తిలో నాదము లీనమయి యుండును. ఒక విత్తనములో అంకురము ఎట్లుండునో కుండలినీ శక్తిలో నాదము అట్లుండును. ఆ స్థితిలో అది అవ్యక్తముగా నుండును. ఈ స్థితిలో **పరా** అని, అట్లే విత్తనమునుండి అంకురము బయటికి తొంగి చూచినట్లు కుండలినీశక్తినుండి ప్రాణవాయురూపమున బొడ్డుప్రాంతమున మణిపూరప్రారంభమున నాదము తొంగి చూచును. అనగా **స్పందన** నాభి వద్ద ప్రారంభమగును. ఇదే **పశ్యన్తీ** అనబడును. ఈ స్పందన హృదయమున అనాహతచక్రస్పర్శతో నాదరూపము దాల్చును. దీనిని **మధ్యమా** అందురు. మొలక తలఎత్తినట్లుగా దీనిని భావింపవచ్చును. ఈ నాదము పరిణతమయిన ముఖయంత్రమున ప్రవేశించి మాటలనుంచి పాటలదాకా అభివ్యక్తమగును. అదే **వైఖరీ** లేనిచో మధ్యమగానే మూర్ధస్థానమున చేరి పరాశక్తిలో కలసిపోవును. అందువలననే మునులు వైఖరిని తగ్గించి మౌనముదాల్చి నాదశక్తిని పరా రూపమున లయము చేసెదరు. మన చెవులలో వినబడు ప్రాణనాదము మధ్యమా రూపము అనవచ్చును. ఈ నాదరూపములన్నియు శబ్దబ్రహ్మ రూపములు. దేవి నాదమయి.

**విశేషములు**

౧. సౌందర్య సముద్ర మథనమువలన ఉద్భవించిన సుధాబింబము అనుటవలన దేవీ ముఖచంద్రబింబము అమృతమయమైన వాగ్భవకూటము సూచింప బడినది. ఇది ధవళకాంతిమయము.

౨. త్రిపురా అనగా త్రిపురములందు త్రిలోకములందు త్రికూటములందు

అఖండముగా వ్యాపించిన త్రిపురసుందరి అని అర్థము.

3. అరుణవర్ణము అనుటవలన మధ్యకూటము సూచితము. మఱియు సృష్టికారణమయిన దేవీతత్త్వము సూచింపబడినది. ఎట్లన- శివతత్త్వము నిష్క్రియము శాంతము నిర్వికారము కనుక దానిని 'శుభ్ర 'వర్ణముగా సంకేతించినారు. అట్టి శివతత్త్వమునందు సృష్టి సంకల్పము కలుగును. ఈ సంకల్పము రాగము. ఇదియే ఇచ్ఛాశక్తి. ఇదియే శివునియందు శక్తి స్పందము. ఈ ఇచ్ఛయే కామము, రాగము. దీనినే 'విమర్శము' అందురు. ఇది అరుణ వర్ణము. కనుకనే కామేశ్వరీదేవిని 'కురువిందసమప్రభా' అందురు. కనుక అరుణ వర్ణము చే కామరాజకూటము సూచింపబడెను.

4. కామకలాబీజము 'క్లీం' లేదా 'ఈం' అని చెప్పబడును. త్రిలోకములకు ఇది ఉత్పత్తి స్థానము. ఇదే మధ్యమకూటమునకు ప్రతినిధి. లయస్థానమున్ను ఇదే. 'యథోర్ణ నాభిః సృజతే గృహ్యతే చ' అన్నట్లు. సాలెపురుగు దారమును నోటినుంచి వదలును. మఱల వెనుకకు లాగును. అట్లే దేవి సృజించును. మఱల తనలోకి లయించుకొనును. దీనినిబట్టి 'శ్రీశివా శివశక్త్యైక్యరూపిణీ' అని చెప్పి నట్లు అయినది. అనగా శక్తికార్యమయిన సృష్టి, శివకార్యమయిన ప్రలయము- ఈ రెండింటిని జరిపినది. ఈ మాటకు త్రిలోక నిలయమ్ అను విశేషణము సూచకము. నిలయమనగా నివాసస్థానము. నిలీనమగు స్థానము అని అర్థము.

5. 'పంచదశి' అనగా 15 అక్షరముల లేదా బీజముల విద్య. ఇందలి 15 అక్షరములు త్రిపాదగాయత్రికి- భూః భువః సువః అను 3 వ్యాహృతులకు సమానము. పంచదశిని గుప్తగాయత్రి అనియు సంకేతవిద్య అనియు అందురు. ఇందలి 15 అక్షరములు త్రిలోకశక్తులకు సంకేతము. అది 3 భాగములు. 1). వాగ్భవకూటము. 2). కామరాజకూటము. 3). శక్తికూటము. ఈ 3 ఖండము లకు తొలిభాగమున బాలా మంత్రబీజాక్షరములను సంపుటి చేసినచో 18 అక్షరములుగల 'సౌభాగ్యవిద్య' అగును.

గాయత్రికి 4వ పాదము గలదు. అందుకు బదులుగా పంచదశియందు శ్రీం

బీజము చేర్చినచో షోడశి యగును. ఈ శ్రీబీజమే గుప్తమయిన అమృతకల. 16వ కల. కాని ఈ విషయమున మఱొక మతము గలదు. శ్రీం బీజమునకు బదులు పంచదశిలోని 'హ్రీం' బీజమునందే 'ఈం' అను ప్రశ్లేష చేసెదరు. 'ఈం' దేవీ ప్రణవము. పంచదశియందే 'ఈ' షోడశకల ఉన్నది.

శ్రీసూక్తమున గూడా కొందఱు 'తామీశ్వరీగ్ం శరణమహం ప్రపద్యే' అను చోట 'తామీశ్వరీమీం శరణమహం ప్రపద్యే' అని 'ఈం' బీజముతో చదివెదరు. 'శ్రీం=ఈం' అని అర్థము.

శ్రీబీజముతో గూడిన విద్యకు **హయగ్రీవవిద్య** అని పేరు. దేవికి **రాజ రాజేశ్వరి** అని పేరు. ఈ 16వ కల 'సదా' ఉండునది కనుక 'సాదా' అనిరి. సర్వము దీనియందు లీనమగును కనుక 'సాదా' అనిరి. ఇది 16వ కల కనుక దీనికి 'చంద్రకలా' విద్య అనియు పేరు. శ్రీవిద్య అనియు పేరు. 'ఈ' అనునదియు కుండలినియే కాని వేరు కాదు. శక్తిః కుండలినీతియా నిగదితా ఆ ఈ మ సంజ్ఞా- అని త్రిపురాసార సంగ్రహమున నాగభట్టు అభిప్రాయము. అర్థమేమనగా 'ఆ, ఈ, మ' అనునవి కుండలిని పేర్లు అని.

ఇట్లు లోకమయుమై, మంత్రమయుమై, నాదమయుమై ఒప్పుచున్న త్రిపురసుందరిని క్రోధభట్టారకుడను పేరుగల **దుర్వాసుడు** స్తుతించినాడు.

**అవతారిక:**- మూలాధారచక్రమునుండి షట్చక్రములందు వ్యాపించి క్రమముగా సహస్రారమహాపద్మమధ్యకర్ణికలోని త్రికోణ సింహాసనమును అధిష్ఠించిన సింహాసనేశ్వరిని ఈ శ్లోకమున స్తుతించుచున్నాడు.

శ్లో॥ ఆదిక్షాన్త సమస్తవర్ణ సుమణిప్రోతే వితానప్రభే
బ్రహ్మాది ప్రతిమాభికీలిత షడాధారాబ్జ కక్షోన్నతే।
బ్రహ్మాణ్డాబ్జమహాసనే జనని తే మూర్తిం భజే చిన్మయీమ్
సౌషుమ్నాయత పీత పఙ్కజ మహామధ్య త్రికోణ స్థితామ్ ॥ 2

**ప్రతిపదార్థము:**- జనని- తల్లీ, ఆదిక్షాన్త- అకారమునుంచి క్షకారమువఱకుగల, సమస్త వర్ణ- సమస్త అక్షరములనెడు, సుమణిప్రోతే- మణులు పొదిగినదియు,

వితానప్రభే-చాందినీ వలె పఱచిన కాంతిగలదియు, బ్రహ్మాది ప్రతిమా-బ్రహ్మ మొ॥ వారి ఆకారములచే, అభికీలిత-అలంకరింపబడిన, షట్-6 అయిన, ఆధారాబ్జ-ఆధార పద్మములయొక్క, కక్షా-కర్ణికలచే లేదా గదులచే, ఉన్నతే-ఎత్తయినదియు అగు, బ్రహ్మాండ-బ్రహ్మరంధ్రమునందలి, అబ్జ-సహస్రదల కమలము అనే, మహాసనే-ఆసనమునందు, సౌషుమ్న-సుషుమ్నా నాడియందలి, ఆయత-విశాలమయిన, పీతపంకజ-పచ్చని పద్మముయొక్క, మహామధ్య-మధ్యభాగమునందలి, త్రికోణ-త్రికోణపీఠమునందు, స్థితామ్-ఉన్న, తే-నీ యొక్క, చిన్మయీమ్-జ్ఞానమయమయిన, మూర్తిమ్-ఆకారమును, భజే-సేవించెదను.

**తాత్పర్యము:**-తల్లీ, మానవ శరీరమున షట్చక్రములుగలవు గదా, అవి ఒకదానిపై నొకటి సోపానములుగా నున్నవి. వాని యందు బ్రహ్మాది దేవతలు బొమ్మల వలె నిబద్ధులయి యున్నారు. ఆ చక్రములందు అకారమునుంచి క్షకారము వఱకు 'వర్ణమాల' మణిమాలవలె మెఱయుచున్నది. అట్టి మణిమయ బ్రహ్మాది షట్చక్ర సోపానములపైగల సహస్రారదల కమలమునందును, సుషుమ్నానాడిలో మధ్య త్రికోణ పీఠమునను కొలువుదీఱిన నీ మూర్తిని సేవించెదను.

**విశేషములు:**- మానవ శరీరమున '7' చక్రములుండును. అందు 1. మూలాధారము ఇది లింగమూలమున నుండును. 2. స్వాధిష్ఠానము-ఇది బొడ్డుక్రింద ఉండును. 3. మణిపూరము-ఇది నాభి వద్ద నుండును. 4. అనాహతము-ఇది హృదయము వద్ద నుండును. 5. విశుద్ధము-కంఠమున నుండును. 6. ఆజ్ఞ-భ్రూమధ్యమున నుండును. 7. సహస్రారము-మూర్ధ స్థానమున నుండును.

ఈ చక్రములందు వర్ణములు దేవతలు ఉండెదరని యోగశాస్త్రము. దాని ప్రకారము

౧. మూలాధారము-వ,శ,ష,స-4 దళాలు-దేవత బ్రహ్మ-గ్రంథి బ్రహ్మ-

లోకము భూలోకము.

౨.స్వాధిష్ఠానము- బ, భ, మ, య, ర, ల, -6 దళాలు- దేవత విష్ణువు- గ్రంథి బ్రహ్మ -లోకము భువర్లోకము.

3. మణిపూరము- డ, ఢ, ణ, త, థ, ద, ధ, న, ప, ఫ-10 దళాలు- దేవత రుద్రుడు- గ్రంథి విష్ణు- లోకము సువర్లోకము.

౪. అనాహతము- క, ఖ, గ, ఘ, ఙ, చ, ఛ, జ, ఝ, ఞ, ట, ఠ-12 దళాలు- దేవత ఈశ్వరుడు- గ్రంథి విష్ణు- లోకము మహర్లోకము.

౫. విశుద్ధము- అచ్చులు-16 దళాలు- దేవత సదాశివ- గ్రంథి రుద్ర- లోకము జనోలోకము.

౬. ఆజ్ఞ- హం, క్షం-2 దళాలు- దేవత అర్ధనారీశ్వరుడు- గ్రంథి రుద్ర- లోకము తపోలోకము.

౭. సహస్రారము- సర్వ వర్ణములు 'అ' నుంచి 'క్ష' వఱకు-1000 దళాలు- దేవత పరమాత్మ- లోకము సత్యలోకము.

కనుక షట్చక్రముల పైన '7' వ అంతస్తుగా నున్నది 'సహస్రారము'. అందు మధ్యకర్ణికలో సింహాసనము త్రికోణము. అందు పరమేశ్వరి గలదు.

2. సుషుమ్నలోని పచ్చని( పసుపువలె) కమలము మధ్యలో 'అకథ' అనే అక్షరము లతో ఏర్పడిన త్రికోణమునందు బిందురూపముగానున్న స్వయంభూ లింగము ను పరివేష్టించి 3 1/2 చుట్లుగా నున్న నాగినివలెనున్నది దేవీరూపము. కాని ఆగమ కల్పద్రుమము అను గ్రంథమున అకథాది త్రికోణము సహస్రారమున నున్నట్లు గలదు. చూ॥

అథ శుభ్ర సహస్రారే పూర్ణేందు మధ్య విస్ఫురత్।
త్రికోణం తడిదాభాస మకథాది హలక్షయుక్॥

ఆగమకల్పద్రుమం-౫ అధ్యా.

అచ్చట బిందురూప పరమాత్మ గలదు. కాని అచ్చట కుండలినీ 3 1/2 చుట్లుగా నున్నట్లు ఎచ్చటను చెప్పబడలేదు. మఱియు సహస్రారకమలము

పచ్చనగా చెప్పబడలేదు. అది శుక్లవర్ణము- మధ్యలో రక్తవర్ణ తంతువులు గలదిగా చెప్పబడెను. కనుక వ్యాఖ్యాన వివరణమునుపేక్షించిన చో మంచిది. లేదా మూలాధారగత త్రికోణముగూడా 'అకథా' ది త్రికోణముగా భావించుట సంప్రదాయసిద్ధముగా వచ్చును.

3. సుషుమ్న-

మానవదేహమునందుగల వెన్నెముకలో దారమువంటి 3 నాడులు గలవు. అవి ఇడ, పింగళ, సుషుమ్న. ఇందులో సుషుమ్న అత్యంత ముఖ్యము. ఇది మాడువఱకు వ్యాపించి యుండును. దీని యందు షట్చక్రములుండును. అందు మూలాధారమున స్వయంభూలింగము గలదు. దానిని చుట్టుకొని అణు సదృశమయిన తీగవలె నాగినివలె కుండలిని 3 1/2 చుట్లుగా పరుండి యుండును. ప్రాణాపానసమ్మర్దమువలన ప్రాణశక్తి సుషుమ్నలోనికి ప్రవేశించును. అచ్చట తన ఘర్షణశక్తివలన కుండలినిని నిద్రలేపును. ఆ కుండలిని స్వయం భూలింగ ముఖద్వారము గుండా సుషుమ్నలోనికి ప్రవేశించి షట్చక్రములను భేదించుచు సప్తమచక్రము అయిన సహస్రారమున పరమాత్మ బిందువును చేరును. స్థూలముగా యోగక్రమము ఇది. ఇదంతయు పుణ్యమునుబట్టి కొన్ని జన్మలు గడచిన మీదట సాధకునకు లభించు రాజయోగము. ఇట్టి సుషుమ్న యందుగల మూలాధార త్రికోణమునందు నిద్రించుచున్న కుండలినీ శక్తి నిద్ర లేచి సహస్రారమున పరశివుని కలియుట అను స్థితి ఇచ్చట వర్ణింపబడినది.

4. సంప్రదాయ విశేషము:

సంస్కృత వ్యాఖ్యాకర్త శ్రీనిత్యానందులు ఈ శ్లోకమున నొక రహస్యమును వెల్లడించినారు. ఉపాసకులు 'అంతర్మాల'తో జపము చేసెదరు. అంతర్మాల అనగా సుషుమ్నా నాడి. ఇది ఒక జపమాల అని భావింపవలెను. దీనియందు పైన తెలిపిన ప్రకారము 51 వర్ణములు ఆయా చక్రములలో నుండును. వాటినే 51 మణులుగా భావింపవలయును. ఆ ప్రకారము ఈ మణిమాలతో ఇట్లు జపము చేయవలయును. మూలాధారమునుండి బ్రహ్మరంధ్రమువఱకు,

అకారము నుంచి క్షకారమువఱకు మానసికజపము చేసెదరు. మఱల క్షకారము నుండి అకారమువఱకు జపము చేయవలెను. అనగా, విశుద్ధచక్రమునుంచి అనాహత, మణిపూర, స్వాధిష్ఠాన, మూలాధార ఆజ్ఞల వఱకు ఒక జపము, మఱల ఆజ్ఞనుండి మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూర, అనాహత విశుద్ధముల వఱకు మఱొక జపము చేసెదరు. ఇట్లు 100 జపము చేసెదరు. 1 మేరువుగా భావింపవలయును. దీనివలన మంత్రమునకు బలము పెరుగును అని సంప్రదాయము. అత్యంతరహస్యమయిన యీ విషయమును యోగులు బయట పెట్టరు. కాని సంస్కృత వ్యాఖ్యాత శ్రీనిత్యానందులు మనపై కనికరము వలన వెల్లడించినట్లు వివరించినాడు.

5. యోగాగ్నికి వెచ్చబడిన కుండలిని మూలాధారమునందలి త్రికోణమునుండి లేచి క్రమముగా సుషుమ్నారంధ్రము ద్వారా షట్చక్రములను భేదించి సహస్ర దళకమలమును పొంది అచ్చట పరిభ్రమించును. అప్పుడు సహస్రారమునందలి చంద్రమండలమునుండి అమృతబిందుస్రావము జరుగును. ఆ బిందువులే మాతృకాక్షరములు. అవి సుషుమ్న అనబడు బ్రహ్మసూత్రము ద్వారా ఆయా చక్రములందుగల చక్రదేవతలకు అభిషేకము గావించును. ఆ బిందు పరంపర మూలాధార త్రికోణము వఱకు కురియును. ఈ దృశ్యమున 'సుషుమ్నానాడి' ముత్యములు పొదిగిన బ్రహ్మసూత్రము( జందెము) వలె కనుపించును.

6. చక్రములందు మనస్సును నిలిపి భావన చేయుటవలన ఆ చక్రములు వానికి సంబంధించిన పంచభూతములు స్వాధీనమగును. ఉదా।

స్వాధిష్ఠానము జలచక్రము. దానియందు మనస్సు నిలిపి ధ్యానించిన వానికి జలము వలన భయము లేదు. జలస్తంభనము మొదలగునవి చేయగలడు. ఇట్లే మిగిలినవి.

'మన ఆకృష్య విషయాత్ తత్తచ్చక్రే నివేశయేత్' - చక్రకౌముదీ.

**అవతారిక:** - సంకేతసార విద్యలో మొదటిది అచ్చులలో 12వది అయిన వాగ్భవ (ఐం) బీజమును స్తుతించుచున్నాడు. ఇది సకలవిద్యా ప్రకాశకము.

శ్లో॥ వన్దే వాగ్భవ మైన్దవాత్మసదృశం వేదాది విద్యాగిరో
భాషా దేశ సముద్భవాః పశుగతా శ్ఛన్దాంసి సప్తస్వరాన్।
తాలా న్పఞ్చ మహాధ్వనీ న్ప్రకటయత్యాత్మ ప్రసారేణ య
త్తద్బీజం పదవాక్యమాన జనకం శ్రీమాతృకే తే పరమ్॥ 3

**ప్రతిపదార్థము:**- శ్రీమాతృకే- ఓ శ్రీమాతా!, ఐన్దవాత్మ-చంద్రామృతముతో, సదృశమ్- సమానమైనదియు, వేదాదివిద్యాగిరః- వేదశాస్త్రములు మొ॥ వాక్యములను, దేశసముద్భవాః- ఆయా దేశములందు పుట్టిన మఱియు, పశుగతాః- పశువులందుగల, భాషాః- భాషలను, ఛన్దాంసి- వివిధ ఛందస్సులను, సప్తస్వరాన్- సరిగమ మొ। సప్తస్వరములను, తాలాన్- ధ్రువ మొ।తాళములను, పఞ్చ -ఐదు, మహాధ్వనీన్- భేరీ మొ। ధ్వనులను, యత్- ఏ బీజము, ఆత్మప్రసారేణ- సహస్రారమునుండి అమృతవర్ణ ప్రసారము ద్వారా, ప్రకటయతి- ప్రకటించునో, తత్- అదియును, పదవాక్యమాన జనకమ్- పదములను వాక్యములను, ప్రత్యక్షాది ప్రమాణములను కలిగించునదియు అగు, వాగ్భవమ్- వాగ్భవమను పేరుగలదియు, పరమ్-గొప్పదియు అగు, తే- నీ, బీజమ్- 'ఐం' బీజమును, వన్దే- నమస్కరించుచున్నాను.

**తాత్పర్యము:**- శ్రీమాతా! నీ వాగ్భవ బీజమునకు నమస్కారము. అది మూర్ధ స్థితమై సహస్రారమునుండి అమృతమును స్రవించును. అమృతస్రావము ద్వారా శ్రీవిద్యా వర్ణములను ముత్యములవలె షట్చక్రముల వఱకును వర్షించును. ఈ సారస్వత బీజమునుండియే వేదశాస్త్రములు దేశభాషలు పశుపక్షిధ్వనులు, ఛందస్సులు స్వరములు తాళములు భేరీధ్వని మొ। ధ్వనులను సృజించును. అది పదములను వాక్యములను ప్రత్యక్షాది ప్రమాణములను కల్గించును. అట్టి బీజమునకు నమస్కారము.

**విశేషములు:**-

౧. వాగ్భవము అనగా వాక్కులనుండి పుట్టినది అని అర్థము. ఋక్ యజుః సామ వేదముల ఆద్యక్షరముల నుండి అనగా వాని సముదాయరూపము అని అర్థము.

౨.'ఐం' బీజము చంద్రమండల సదృశము. అనగా చంద్రునివలె ఇదియు అమృతము స్రవించును. 'వాగ్భవేనేన్దు మహసా వాగీశత్వ ప్రదాయినీ' - జ్ఞా.తం.
3.దేవి నాదమయి కనుక సహస్రారమునుండి వచ్చు అమృతస్రావమునందు సర్వవిధ శబ్దసామగ్రి ప్రవహించును. 'ఐం' వాగ్బీజము. కనుక దీనియందు వేదాది విద్యలు నర పశు పక్షి భాషలు ఛందస్సులు దొరలును.
౪.పంచధ్వనులు- తాళనాదము, వేణునాదము, భేరీనాదము, మృదంగనాదము, మేఘనాదము ఇట్టివి. దశవిధనాదములలో ప్రధానమైనవి పంచనాదములు. ఈ విషయములు 'నాదబిందూపనిషత్తు' లోను, 'హంసోపనిషత్తు' లోనను గలవు. సకల శబ్దజాల మాతృభూతమయిన పంచదశీవిద్యలో ఆద్యక్షరమయిన వాగ్భవము శబ్దసామగ్రిని సమాధిలో వర్షించును అనుట యోగిజనులకు అనుభవవేద్యము. సామాన్యులగు మనకు పరోక్షజ్ఞానమే.చూ॥

యస్యదేవే పరాభక్తిః యథా దేవే తథా గురౌ।
తస్యైతేకథితాహ్యర్థాః ప్రకాశన్తే మహాత్మనః ॥ (సూతసంహిత).

**అవతారిక:** - బాలావిద్యలోని మొదటి వర్ణమయిన వాగ్భవబీజమును గూర్చి ఇందులో వర్ణన గలదు.

శ్లో॥ త్రైలోక్య స్ఫుటమన్త్ర తన్త్ర మహిమా నాప్నోతి శశ్వద్వినా
యద్బీజం వ్యవహారజాలమఖిలం నాస్త్యేవ మాత స్తవ।
తజ్జాప్యస్మరణ ప్రసక్తి సుమతిః సర్వజ్ఞతాం ప్రాప్య కః
శబ్దబ్రహ్మనివాసభూతవదనో నేన్ద్రాదిభిః స్పర్ధతే ॥ ౪

**ప్రతిపదార్థము:** - మాతః-తల్లీ, తవ- నీ యొక్క, యత్- ఏ, బీజం వినా- వాగ్భవ బీజములేనిదే, త్రైలోక్య- ముల్లోకములందు, స్ఫుట- స్పష్టమయిన, మంత్ర తంత్ర- మంత్రముల యొక్క, తంత్రముల యొక్క, మహిమా- మహిమ, శశ్వత్ -ఎల్లప్పుడు, నాప్నోతి- లభింపదో, అఖిలమ్- సమస్తమైన, వ్యవహార జాలమ్- చేష్టలు, క్రియలు, నాస్త్యేవ- లేనేలేదో, తజ్జాప్యస్మరణ- ఆ బీజ జపమునందు, ప్రసక్తి- ఆసక్తిచే, సుమతిః- మంచిబుద్ధిగలవాడు కనుకనే, శబ్దబ్రహ్మ- సకల చైతన్య

స్వరూపమైన నాదశక్తికి, నివాసభూత-నివాసమైన, వదనః-ముఖము కల, కః-ఎవడు, ఇంద్రాదిభిః-ఇంద్రాది దేవతలతో, న స్పర్ధతే-పోటీపడకుండా ఉండును. అనగా పోటీపడగలడు.

**తాత్పర్యము:**-దేవీ! నీ వాగ్భవబీజము నుపాసింపకపోయినచో, ముల్లోకముల యందలి మంత్ర తంత్రమహిమలు అసంభవము అగును. లోకములో జరుగు వ్యవహారము లన్నియు అసాధ్యమగును. అట్టి నీ వాగ్భవబీజమును నిరంతరము జపించి ధ్యానించి ఆ శబ్దశక్తిని తన నోట నిలిపినవాడు ఇంద్రాదులతోనైనను పోటీపడగలడు.

**విశేషములు:**-

౧. సత్యవ్రతుడు ఈ 'ఐం' బీజమును కాకతాళీయముగా బాల్యముననే నేర్చి మహాభక్తుడయ్యెనని దేవీభాగవతము.

౨. 'అకారో వై సర్వా వాక్' అని వేదము. అట్టి అకారము ఐంబీజమున మొదటి బీజము. ఓంకారమునను ఇట్లే అకారము ప్రథమబీజము.

**అవతారిక:**-పూర్వ శ్లోకమున వాగ్భవబీజమును స్తుతించి ఈ శ్లోకమున దాని పైనగల 'మాత్ర'ను స్తుతించుచున్నాడు.

శ్లో॥ మాత్రా యాత్ర విరాజతేఽతివిశదా తామష్టధా మాతృకాం
శక్తిం కుణ్డలినీం చతుర్విధతనుం యస్తత్త్వవిన్మన్యతే।
సోఽవిద్యాఖిల జన్మ కర్మ దురితారణ్యం ప్రబోధాగ్నినా
భస్మీకృత్య వికల్పజాల మఖిలం మాతః పదం తద్వ్రజేత్ ॥ ౫

**ప్రతిపదార్థము:**-మాతః-తల్లీ, యా-ఏ, మాత్రా-'ం' అనుస్వారరూప 'మ' కారము, అత్ర-ఈ వాగ్భవబీజ చరమభాగమున, అతివిశదా-అతిశుభ్రవర్ణమై, విరాజతే-ప్రకాశించునో, తామ్-ఆ మాత్రను, అష్టధా-వశిని మొదలగు '8' యోగిని వర్గముగాను, మాతృకామ్-'51' వర్ణములుగాను, శక్తిమ్-సృష్టి స్థితి సంహార శక్తిగాను, కుండలినీమ్-కుండలినీ శక్తిగాను, చతుర్విధ-నాల్గు విధము లైన, తనుమ్-అగ్ని సూర్య సోమ సమష్టిరూపములు గలదానిని గాను, యః-

ఏ, తత్త్వవిత్-తత్త్వవేత్త, మన్యతే-తలంచునో, సః-ఆ తత్త్వవేత్త, అవిద్యా-అజ్ఞానము, అఖిల-సమస్తములైన, జన్మ-నర పశు పక్ష్యాది జన్మలు, కర్మ-సంచితము, ఆరబ్ధము మొ॥ కర్మలు, దురిత-పాపములు-వీనియొక్క, అరణ్యమ్-అడవిని, అట్లే, అఖిలమ్-సమస్తమైన, వికల్పజాలమ్-వివిధ వాసనా రూపభావనలను, ప్రబోధాగ్నినా-జ్ఞానాగ్నితో, భస్మీకృత్య-భస్మీపటలము చేసి, తత్-ఆ, పదమ్-బ్రహ్మస్థానమును, వ్రజేత్-చేరుకొనును.

**తాత్పర్యము:-** తల్లీ! వాగ్భవబీజము చివర వినబడు 'మాత్ర' అత్యంత నిర్మల మైనది. దీనినే సర్వవర్ణములకు మూలముగాను, వశిన్యాది వాగ్దేవతారూపము గాను, కుణ్డలినీశక్తిగాను, అగ్ని సూర్య సోమ సమష్టి శక్తిగాను, ధ్యానించి దర్శించ గలిగిన సంప్రదాయజ్ఞుడైన తత్త్వవేత్త అజ్ఞానజన్యమైన 'కర్మ జన్మ పాప' బంధము లను త్రెంచికొని, ఎట్టి పూర్వజన్మవాసనలు లేనివాడై, శాశ్వతపదమును పొంద గలడు.

**విశేషములు:-**

౧. 'మాత్ర' అనునది సామవేదము యొక్క ఆదివర్ణము వంటిది. బీజమునుండి వచ్చు అంకురము వంటిది. ఘంటనుండి వచ్చు ధ్వని వంటిది. ఇది విశ్వ మూలము. నాదశక్తి అయిన దేవిరూపము.

౨. వశిని మొదలుగా 8 దేవతలను వాగ్దేవతలని, రహస్యదేవతలనియు అందురు. వీరు శ్రీచక్రమున అష్టకోణమున సర్వరోగహరచక్రమున నుందురు.

3. కుండలిని 4 విధములు.

మూలాధారమున అగ్ని కుండలిని యందురు.

హృదయమున సూర్యకుండలిని యందురు.

భ్రూమధ్యమున సోమకుండలిని యందురు.

మూలాధారముకన్న క్రింద వాగ్భవాకార త్రికోణమున సమష్టి కుణ్డలిని అందురు.

౪. నాగభట్టు ప్రకారము

శ్లో॥ ఏతస్యాః పరతః పరా త్పరతరం నిర్వాణశక్తేః పదం

శైవం శాశ్వతమప్రమేయ మచలం నిత్యోదితం నిర్మలమ్।
తద్విష్ణోః పదమిత్యుశన్తి సుధియః కేచిత్పదం బ్రహ్మణః
కేచిద్ధంసపదం నిరఞ్జనపదం కేచిన్నిరాలమ్బనమ్ ॥

అనగా 'నిర్వాణకల తరువాత నిర్వాణశక్తియొక్క స్థానము కలదు. దీని మధ్యయందు శివస్థానము గలదు అది శాశ్వతము, నిర్మలము. దానినే కొందరు బ్రహ్మపదమని, కొందరు విష్ణుపదమని, కొందరు హంసపదమని చెప్పెదరు'.

౫. శ్రీతత్త్వచింతామణి యందు షట్చక్రనిరూపణాధ్యాయమున పూర్ణానన్ద యతియు ఇట్లే చెప్పెను.

'తస్యా మధ్యాన్తరాలే శివపదమమలం శాశ్వతం యోగిగమ్యం
నిత్యానన్దాభిధానం సకలసుఖమయం శుద్ధబోధస్వరూపమ్।
కేచిత్ బ్రహ్మాభిధానం పదమితి సుధియో వైష్ణవం తల్లపన్తి
కేచిత్ హంసాఖ్య మేతత్కిమపి సుకృతినో మోక్షమాత్మప్రబోధమ్॥

అనగా, నిర్వాణశక్తి మధ్యమున నిర్మలమైన శివస్థానము గలదు. దానినే పలువురు పలు విధములుగా చెప్పుచున్నారు. విష్ణుస్థానమని, హంసమని, బ్రహ్మమని, శక్తి యని చెప్పుచున్నారు.

౫(1). యేషాం ప్రభాభిరంతస్స్థం వస్తు కించిత్ నదృశ్యతే- అని చింతామణి గృహము గూర్చి దేవీభాగవతము చెప్పినది.

౬. బ్రహ్మశ్రీ తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రి గారు తన 'మత్స్వప్నః' అను గ్రంథములో ఇలా వివరించారు.

'దృశ్యాదృశ్యం చాష్టమం చక్రమూర్ధ్వే మూర్ధ్నః పీఠే స్వాంగులీనాం చతుష్కే।
ద్రష్టుం దూరాద్యోగినామప్యశక్యం శక్తిః శక్తోవా పరం బ్రహ్మమూలమ్ ॥
తస్మిన్ దేశే శక్తిమచ్ఛక్త్య భేదాత్ బ్రహ్మైవేదం శక్తిరేవేయమిత్థం।
ద్రష్టౄణాం దృష్టిప్రభేదా న్మతాని శాక్తేయాదీ న్యావిరాసన్ హితాని ॥

అనగా, బ్రహ్మరంధ్రమునందు గలది పీఠకము అనబడు అష్టమచక్రము. దీని యందు గల తేజస్సు పరబ్రహ్మము. యోగులకైనను స్పష్టముగా కనబడని ఆ తేజస్సు నిర్వచనమునకు లొంగదు. అందువలన యోగులదృష్టినిబట్టి అది

దర్శనమగును. అందువలన విష్ణువని, శివుడని, శక్తియని రకరకాల నిర్ణయములు.

**అవతారిక:** -సంకేతసారవిద్యలో ద్వితీయాక్షరమును కామబీజముగా వర్ణించుచున్నాడు.

శ్లో॥ తత్తే మధ్యమబీజ మమ్బ! కలయామ్యాదిత్యవర్ణం క్రియా-
జ్ఞానేచ్ఛాదిమనన్తశక్తి విభవ వ్యక్తిం వ్యనక్తి స్ఫుటమ్।
ఉత్పత్తి స్థితి కల్ప కల్పిత తను స్స్వాత్మ ప్రసారేణ య-
త్కామ్యం బ్రహ్మహరీశ్వరాది విబుధైః కామం క్రియాయోజితైః ॥౬

**ప్రతిపదార్థము:** -హే అంబ- ఓ తల్లీ, ఆదిత్యవర్ణమ్- అరుణవర్ణమైనదియు, క్రియాజ్ఞానేచ్ఛాదిమ్- ఇచ్ఛా జ్ఞాన క్రియా శక్తులకు మూలమైనదియు, యత్- ఏ బీజము, అనన్త- అంతులేని, శక్తి- శక్తుల యొక్క, విభవ- సామర్థ్యము యొక్క, వ్యక్తిమ్- జ్ఞానమును, స్ఫుటమ్- స్పష్టముగా, వ్యనక్తి- ప్రకటించునో అట్టిదియు, స్వ- కామకలాక్షరమైన తనయొక్క, ఆత్మ- బిందుత్రయ రూపమైన రూపము యొక్క, ప్రసారేణ- ప్రసరణచేత, ఉత్పత్తి- సృష్టియందు, స్థితి- పరిపాలన యందు, కల్ప- సంహారమునందు, కల్పిత- కల్పింపబడిన, తను- మూడు శరీరములు గలదియు, కామమ్- మిక్కిలి, క్రియా- సృష్టిస్థితి సంహార క్రియ లందు, యోజితైః- వియోగింపబడిన, బ్రహ్మహరీశ్వరాది- బ్రహ్మ విష్ణు ఈశ్వరుడు మొ॥ విబుధైః- దేవతలచేత, కామ్యమ్- కోరదగినదియు అగు, తత్ -ఆ, తే- నీ యొక్క, మధ్యమబీజమ్- మధ్యమబీజమైన 'ఈం'కారమును, కలయామి- ధ్యానించెదను, లేదా కకార లకారయుక్తముగా చేసెదను. అనగా 'క్లీం' కారముగా చేసెదను.

**తాత్పర్యము:** - అంబా! నీ మంత్ర మధ్యమ వర్ణము 'ఈం' లేదా 'క్లీం'. ఇది అరుణవర్ణమైన కామబీజము. దీనియందు 'అ+ఈ+మ' అను బీజత్రయము కలదు. వీనినుండియే ఇచ్ఛా జ్ఞాన క్రియాశక్తులు ఉదయించును. కనుక ఈ అనంతశక్తులకు నీ బీజము నిలయము. ఈ బీజమే సృష్టిస్థితి సంహారశక్తులైన బ్రహ్మ విష్ణు రుద్రులుగా రూపుదాల్చినది. ఆ త్రిమూర్తులుగూడా తమ తమ

విధి నిర్వహణలో, ఈ బీజమంత్రమునే స్మరించెదరు. తల్లీ! ఆ బీజమంత్రము 'క్లీం'ను నేను స్మరించెదను.

**విశేషములు:-**

౧. భగవంతుని యందలి శక్తి 3 విధములు.

1. ఇచ్ఛాశక్తి- ఇది భగవంతుని యందలి 'ఇచ్ఛ'గా సంకల్పముగా బయట పడును. ఇది సృష్టికి మూలకారణము.

2. జ్ఞానశక్తి- ఇది తటస్థుడైన పరమాత్మయందు ఏర్పడిన 'నేను' అను బుద్ధియు, దీని వలన ప్రపంచనిర్మాణ జ్ఞానము ఏర్పడును. ఈ జ్ఞానశక్తి వలన ప్రపంచనిర్మాణవిధానము- ఇంజనీరింగ్- ఏర్పడును. అనగా మొదటిది సంకల్పము. రెండవది విధానము.

3. క్రియాశక్తి- ఇది ప్రపంచనిర్మాణ శక్తి.

ఈ మూడు శక్తులు కామకలాబిందువు నుంచి పుట్టినట్లు. అనగా కామకల అయిన 'ఈం' బీజము దేవీస్వరూపముగా సంకేతము. దేవినుంచి జరుగు సృష్టిస్థితి ప్రలయములు మూడు ఈ బీజమునుంచి వచ్చుననుట పై సంకేతము దృష్ట్యా చేసిన నిర్ణయము. ఈ మూడు శక్తులే-

1. వామా జ్యేష్ఠా రౌద్రీ శక్తులుగను, 2. బ్రహ్మ విష్ణు రుద్రులుగను,
3. సూర్య సోమ అగ్నులుగను, 4. అకార ఉకార మకారములుగను,
5. భూః భువః సువః లోకములుగను, 6. పీఠత్రయముగను,
7. లింగత్రయముగను, 8. కాలత్రయముగను,
9. వేదత్రయముగను, 10. వహ్నిత్రయముగను,
11. స్వరత్రయముగను

చెప్పబడును. ఈ విషయము 18 శ్లోకమున వివరింపబడును. సారాంశమేమనగా 'సృష్టిమూలమై సృష్టివ్యాప్తమైన 'త్రివిధ' పదార్థము లన్నింటికి దేవి మూలము. ఆ దేవికి 'క్లీం' లేదా 'ఈం' బీజము సంకేతము. కనుక సర్వమునకు ఈ బీజము మూలము.

౨. ఈ త్రయములనుబట్టి చూచినపుడు ఓంకారము, త్రిపదా గాయత్రి,

గాయత్రికి గల 3 వ్యాహృతులు గూడా ఈ త్రయముతో సరిపోలుచున్నవి. అందువలననే 'గాయత్రి, లలిత' మంత్రములు సమానమని యోగ, తంత్ర శాస్త్ర భావనము.

೫.గాయత్రి-వ్యాహృతులు; లలిత-కూటములు; ఓంకారము-అ ఉ మ్ విభాగములు. సమానముగా కొన్ని త్రయములను చెప్పును.

'అకారం చాప్యుకారం చ మకారం చ ప్రజాపతిః।
వేదత్రయాత్ నిరహరత్ భూః భువః స్వరపీతి చ॥

భూః భువః సువః అనునవి వ్యాహృతులు. ఇవి గాయత్రికి ముందు పలుకబడును. దీనికి ఓంకారము కలుపబడును. అందలి భాగములైన 'అ ఉ మ్' అనునవి ఈ లోకత్రయమునకు కూడ సూచకములు.

'ప్రధానం పురుషః కాలః బ్రహ్మ విష్ణు మహేశ్వరాః।
సత్వం రజః తమః తిస్రః క్రమాత్ వ్యాహృతయః స్మృతాః॥ (కూ.పు)

దీనిని బట్టి భూః భువః సువః అనునవి పైకి లోకములను చెప్పు మాటలుగా నున్నను అవి త్రిమూర్తులు మొ॥ త్రయములకు సూచకములని తెలియుచున్నది. మఱియు, 'వృద్ధహారీత స్మృతి' లో

సర్వేషామేవ మంత్రాణాం కారణం ప్రణవః స్మృతః
తస్మాత్ వ్యాహృతయో జాతాః తాభ్యో వేదత్రయం తథా।
భూరిత్యేవ హి ఋగ్వేదః భువ ఇతి యజుస్తథా
స్వస్సామవేదో భవతి ప్రణవో భూర్భువస్సువః॥

దీనిని బట్టి ప్రణవము లోకత్రయసంజ్ఞ అని, వ్యాహృతులు ప్రణవమునకు రూపాంతరములు అని తెలియచున్నది. పైగా ప్రతివ్యాహృతిలో ప్రణవము కలిపి పల్కినచో 'శక్తి బ్రహ్మ' లను కలిపి మననము చేసినట్లు అగునని తెలియుచున్నది. వృద్ధహారీతస్మృతిలో-

సప్తవ్యాహృతిషు ప్రోక్తః ప్రణవోయః పునః పునః।
సప్తానామపి లోకానాం శక్తి బ్రహ్మ స్వరూపతా॥

మఱియు, ప్రణవముతో కలిపి 'షోడశి' ని మననము చేయుట మఱింత ఫలప్రద

మని తెలియుచున్నది.

విద్యాకూటైః చతుర్భిశ్చ గాయత్ర్యాః చతురంఘ్రిభిః।
సమ్మేళనేన యో జాపః కోటి కోటి ఫలప్రదః॥

౬. ఈ కామరాజబీజము అరుణ వర్ణము.

'కామరాజేన బీజేన శక్రగోప స్ఫురత్త్విషా'- (జ్ఞా. తంత్రం)

**అవతారిక:**-కామరాజబీజమునే ఇందు నమస్కరించుచున్నాడు.

శ్లో॥ కామా న్కారణతాం గతా నగణితా న్కార్యై రనేకై ర్మహీ-
ముఖ్యైః సర్వమనోగతా నధిగతా న్మానై రనేకైః స్ఫుటమ్।
కామక్రోధ సులోభ మోహ మద మాత్సర్యారిషట్కం చ య-
ద్బీజం భ్రాజయతి ప్రణౌమి తదహం తే సాధు కామేశ్వరి॥ ౭

**ప్రతిపదార్థము:**-కామేశ్వరి- ఓ కామేశ్వరీ దేవీ!, మహీముఖ్యైః- భూమి మొ॥, అనేకైః-నానావిధములైన, కార్యైః-కార్యములచేత, కారణతామ్-కారణత్వమును, గతాన్-పొంగిన, అగణితాన్-అసంఖ్యాకములైనవియు అగు, కామాన్- బ్రహ్మాది దేవతల కోరికలను, అనేకైః-నానా విధములైన, మానైః- ప్రత్యక్షాది ప్రమాణముల చేత, స్ఫుటమ్-స్పష్టముగా, అధిగతాన్-తెలుసుకొనబడిన, సర్వ-సర్వ ప్రాణుల యొక్క, మనోగతాన్-మనోరథములను, కామక్రోధ సులోభ మోహ మద మాత్సర్యారి షట్కం చ-కామక్రోధ లోభ మోహ మద మాత్సర్యములను శత్రు వర్గమును, యత్-ఏ, బీజమ్-కామకూటబీజము(క్లీం), భ్రాజయతి-ప్రకాశింపజేయునో, తత్-ఆ, తే-నీ యొక్క, బీజమ్-బీజమును, సాధు-చక్కగా, అహమ్-నేను, ప్రణౌమి-నమస్కరించెదను.

**తాత్పర్యము:**-కామకూటాధి దేవత అయిన ఓ కామేశ్వరీదేవీ! ప్రపంచ స్రష్టలైన బ్రహ్మాది దేవతలు చేసిన సృష్టి మొ॥ కార్యములను బట్టి వారి కోర్కెలను మేము ఊహించుచున్నాము. అనగా, బ్రహ్మకు సృష్టి వాంఛ కలదు, విష్ణువునకు పాలన వాంఛ కలదు, శివునకు సంహార వాంఛ కలదు అని తెలియుచున్నది. అట్లే యీ ప్రపంచమున సమస్త ప్రాణుల మనోగతములు ప్రత్యక్షమును బట్టి

అనుమానమునుబట్టి ఊహింపగలము. అనగా, పశుపక్ష్యాదుల పరుగును బట్టి భయమును, అఱపును బట్టి క్రోధమును ఊహింపవచ్చును. ఈ విధము బ్రహ్మాది పశుపర్యంతము సర్వజనులకు వాంఛలు ఉండును. వాంఛలతో బాటుగా కామ క్రోధములు మొ॥ ఉండును. వీటినన్నింటిని ప్రపంచమున చక్కగా నడపించునట్టి నీ కామరాజబీజమునకు నేను నమస్కరించుచున్నాను.

**విశేషములు:-**

౧.కామరాజబీజమనగా 'క్లీం'.కామకల- అనగా దానిపైగల 'ఈం' అనునది. క-సుఖము, ల-భూమి,ఇంద్రుడు అని అర్థము. ఈ అక్షరములు భౌతిక సుఖ వాచకములు. వీటితో కలసినది 'క్లీం'బీజము. దీని యుపాసన వలన ఐహిక కామసిద్ధి. కామకల ఉపాసన వలన మోక్షము.

'య ఈంశృణోతి అలకం శృణోతి నహి ప్రవేద సుకృతస్య పంథామ్' అని శ్రుతి.'ల,క' లులేని ఈంబీజము ను విన్నవాడు కర్మమార్గమును ఎఱుగడు. అనగా మోక్షమును పొందును అని అర్థము. కనుక 'క్లీం' బీజము ప్రపంచమున సర్వకామమూలము. కామము వలననే 'అరిషడ్వర్గము' ఏర్పడును. ఈ మొత్తమునుబట్టి ప్రపంచమును నడిపించు శక్తి 'క్లీం'బీజము. అనగా దానిచే సంకేతింపబడిన దేవీశక్తి.

౨.కామక్రోధాదులు ఏల శత్రువులు? అనగా

1.యోగులకు అవి ఆవరణను గలిగించును కనుక శత్రువులు. అనగా వారిని అజ్ఞానపు పొరలతో ఆచ్ఛాదన చేయును.

2.సంసారులకు అవి సంసారమునందే పడద్రోయును కనుక శత్రువులు.

**అవతారిక:**-మఱల కామరాజబీజమునే స్తుతించుచున్నారు.

శ్లో॥ యద్భుక్తాఖిల కామపూరణ చణ స్వాత్మ ప్రభావం మహో
జాడ్యధ్వాన్త నివారణైక తరణి జ్యోతిః ప్రబోధప్రదమ్।
యద్వేదేషు చ గీయతే శ్రుతిముఖం మాత్రాత్రయేణోమితి
శ్రీవిద్యే తవ సర్వరాజవశకృ త్తత్కామరాజం భజే ॥౮

**ప్రతిపదార్థము:**- శ్రీవిద్యే- ఓ శ్రీవిద్యాదేవీ, యత్- ఏ బీజము, భక్త- భక్తుల యొక్క, అఖిల- సమస్తమైన, కామ- కోర్కెలయొక్క, పూరణ- నింపుటలో, చణ- నిపుణమైన, స్వ- తనయొక్క, ఆత్మ- బిందుత్రయముయొక్క, ప్రభావమ్ - ప్రసారముగలదో, మహోజాడ్య-గొప్ప అజ్ఞానము అను, ధ్వాన్త-చీకటి యొక్క, నివారణ- నివారించుటలో, ఏక- అద్వితీయమైన, తరణి జ్యోతిః- సూర్యకాన్తి వంటిదో, ప్రబోధ- ప్రజ్ఞానమును, ప్రదమ్- ఇచ్చునట్టిదో, యత్- ఏ బీజము, మాత్రాత్రయేణ- 'అ+ ఉ+ మ్' అను మాత్రాత్రయముతో కూడిన, శ్రుతి ముఖమ్- వేదాది అయిన, ఓమితి- ఓంకారమని, వేదేషు చ- వేదముల యందును, గీయతే-గానము చేయుచున్నదో, తత్- ఆ, సర్వరాజ- సమస్త ప్రభువు లను, వశకృత్- వశము చేయునట్టి, తవ- నీ యొక్క కామరాజమ్- కామరాజ బీజమును, భజే- సేవించెదను.

**తాత్పర్యము:**- భక్తుల వాంఛలను పూరించగల బీజము కామరాజబీజము. సకల అజ్ఞానములను నివారించు సూర్యతేజము ఈ బీజము. వేదాదిబీజము అని పేరు పొందిన ఓంకారమునకు ఈ బీజము రూపాంతరము. ఈ బీజము వలన సాధకులకు సకల రాజులు వశమగుదురు. అమ్మా! అట్టి నీ కామరాజ బీజమును ఉపాసించెదను.

**విశేషములు:**-

౧. క్లీమోంకారస్యైకత్వం వదన్తి బ్రహ్మవాదినః అని వాక్యము. అనగా- 'క్లీం= ఓం' అని బ్రహ్మవేత్తలు చెప్పుచున్నారని అర్థము.

౨. కృష్ణునకు 'క్లీం' బీజము ప్రధానము. కనుక కృష్ణోపాసకులు, దేవీ ఉపాసకులు ఈ 'క్లీం' బీజమును ఉపాసింతురు. వీరికిది 'ఓం'కారముతో సమానము. మోక్ష దాయకము.

3. '6' శ్లోకమున వ్రాసిన విశేషములు చూడవలెను. కామకలాక్షరము బిందు త్రయ స్వరూపము. బిందుత్రయము= సూర్య సోమ అగ్ని రూపము. సోమ సూర్య అగ్నులు= అకార, ఉకార, మకారములు. అకార, ఉకార, మకారములు=

'ఓం', కనుక 'క్లీం, ఓం' అనునవి సమానములు.

**అవతారిక:**-సంకేతసారవిద్య యొక్క తృతీయబీజమయిన ఔకారమును (సౌః) ఇందులో వర్ణించుచున్నాడు.

శ్లో॥ యత్తే దేవి తృతీయబీజ మనలజ్వాలావలీ సన్నిభం
సర్వాధార తురీయబీజ మపరం బ్రహ్మాభిధా శబ్దితమ్ ।
మూర్ధన్యాన్త విసర్గ భూషిత మహౌకారాత్మకం తత్పరం
సంవిద్రూప మనన్యతుల్య మహిమ స్వాన్తే మమ ద్యోతతామ్ ॥ ౯

**ప్రతిపదార్థము:**-దేవి- ఓ దేవీ!, అనలజ్వాలావలీ- అగ్నిజ్వాలా సమూహముతో, సంనిభమ్-సమానమైనదియు, సర్వాధార-సమస్తమునకు ఆధారమైన త్రికోణమునకు అనగా త్రికోణాకారమైన 'ఏ' అను అక్షరమునకు, తురీయ-నాల్గవదైన( అనగా ఏ ఓ ఐ ఔ ఈ వరుసలో ఔ నాల్గవది కనుక), బీజమ్- బీజమైనదియు, అపరమ్- మతియొక్క, బ్రహ్మాభిధా-శబ్దబ్రహ్మ అను పేరుతో, శబ్దితమ్- పిలువబడినదియు, మూర్ధన్యాన్త- బిందువు అంతముగల, అట్లే, విసర్గ భూషిత- 'ః' లతో అలంకరింపబడిన, మహో-గొప్ప, ఓ+ఔ కారాత్మకమ్- ఓంకార, ఔః కారస్వరూపమైనదియు, పరమ్- పరమైన, సంవిద్రూపమ్- జ్ఞాన రూపమైనదియు, అనన్యతుల్య-అనితర సాధారణమైన, మహిమ-మహిమ గలదియు అగు, తే- నీ యొక్క, తృతీయబీజమ్- మూడవ బీజము ఏది గలదో, తత్- ఆ బీజము, మమ-నా యొక్క, స్వాన్తే-మనస్సునందు, ద్యోతతామ్-ప్రకాశించుగాక!

**తాత్పర్యము:**-దేవీ! మహాశక్తీ, నీ తృతీయబీజము అగ్నిజ్వాలా సమానము. సర్వాధారమైన నీ త్రికోణబీజమునుండి అది తురీయమైనది. దానికి 'శబ్ద బ్రహ్మ' అని మఱొక పేరు గలదు. అది ఓంకారముతో సమానమైనది. ఓంకార స్వరూపమైనది. పరమజ్ఞాన స్వరూపమైనది. అసాధారణ మహిమ శక్తి గలది. అట్టి నీ తురీయ బీజమును 'సౌః' లేదా 'ఔః' అనునది నా మనస్సున స్ఫురించును గాక!.

విశేషములు:-

౧.శరీరమునందు 3 ఖండములు గలవు. సోమ సూర్య అగ్ని ఖండములు గలవు. అందు మణిపూర చక్రమునుండి మూలాధారమువఱకు అగ్నిఖండము. ప్రణవములో దీనికి 'మకారము' సంకేతము. అట్లే 'సౌః' బీజము మకార ప్రతినిధి. శక్తిబీజము కనుక అగ్నిజ్వాలా సమానమని చెప్పబడెను.

౨.'ఏ' ఇది నాగరిలిపిన త్రికోణాకారము. అందువలన దీనిని త్రికోణముగా చెప్పెదరు. త్రికోణము దేవికి ప్రతీకము. కనుక 'ఏ'కారము సర్వాధారమని చెప్పబడినది. దాని నుండి 'ఏ ఓ ఐ ఔ' అను సంస్కృతాక్షరక్రమమున 'ఔ'నాల్గవది. కనుక దీనిని సర్వాధార తురీయబీజము అనిరి.

౩.'స'-సర్వము అని అర్థము. 'సం' బీజమును సర్వతత్త్వములకు ప్రతీకగా చెప్పెదరు. సౌః అను బీజములో స్+ అ+ ఓ+ః అను భాగములు గలవు. సర్వాధారమైన తురీయబీజము అనగా 'స' ఆధారముగాగల 'ః' అని అర్థము వచ్చును. తద్వారా 'ం' శివుడు, దాని ద్వైతమైన 'ః' దేవి. కనుక సర్వాధార తురీయ బీజము శక్తిబీజము 'సౌః' నీ స్వరూపము అని చెప్పినట్లగును. ఐం-వాగ్భవ బీజము, క్లీం-కామబీజము, సౌః-శక్తిబీజము అనుట సంప్రదాయము.

౪.ఓంకారము శబ్దబ్రహ్మ. 'ఓమిత్యేకాక్షరం బ్రహ్మ' అని గదా! ఈ 'ఔః' గూడా మఱియొక 'బ్రహ్మ' అని కీర్తితము.

౫.మహౌకారము అను పదమును రెండు విధములుగా విడదీయదగును. 1.మహా+ ఓకార, 2.మహా+ ఔకార. వీనికి వరుసగా మూర్ధన్యాన్త, విసర్గ భూషిత అన్వయింపవలెను.

ఇచట మూర్ధన్యము అనగా 'బిందువు' అను అర్థము. అనగా మూర్ధయందు సహస్రారమున 'బిందువు'గలదు. దాని యందే ఓంకార నాదము పుట్టుట లయించుట జరుగును. కనుక 'ఓం'కారము మీద వినబడు 'ం' మూర్ధన్యముగా, బిందువుగా భావించవలెను. మామూలు అనుస్వారముగా భావింపరాదు.-శ్రీనిత్యానందులు.

౬.ఇచ్చుటనే మఱొక సమన్వయము చూపవచ్చును. 'మూర్ధన్యాన్త విసర్గ భూషితం అహాకారాత్మకమ్' అని చెప్పవచ్చును. కాగా, 'అహ+౦=అహం', ఔ+ః=ఔః అనియు చెప్పవచ్చును. అగ్నిఖండమునందలి జీవుడు 'అహంకార' బద్ధుడు కనుక అహం=ఔః అనియు చెప్పవచ్చును.

౭.సంవిద్రూపము-సంవిత్తు అనగా జ్ఞానశక్తి కుండలిని.

'సంవిత్స్వరూప బిస కందల కందరూపే
సంసార సంతమసబంధ విభాత సంధ్యే।
త్రాయస్వ కుండలిని కుంకుమ తామ్రదేహే
మాతః త్రికోణ మణిమండపదీపరేఖే ॥

అని మా గురువుగారు శ్రీ తాడేపల్లి రాఘవనారాయణ శాస్త్రిగారు మహా విద్యాపారాయణమున నిత్యము ప్రార్థనలో మననము చేయుచుండగా మేము వినిన శ్లోకము. దీనిని బట్టి తెలియునదేమనగా-

1. కుండలినీశక్తి జ్ఞానాంకుర శక్తి
2. కుండలిని సంసారపు అజ్ఞానమును హరించును.
3. ఆమె అరుణ వర్ణ
4. దీపరేఖ వంటిది
5. త్రికోణ పీఠమున నుండుననియు తెలియును.

**అవతారిక:-** 'సౌః' బీజమునే పరాశక్తిరూపముగా ధ్యానించుచున్నాడు.

శ్లో॥ సర్వం సర్వత ఏవ సర్గసమయే కార్యేత్ర్వియాణ్యన్తరా
తత్తద్దివ్య హృషీక కర్మభిరియం సంవ్యశ్నువానా పరా।
వాగర్థ వ్యవహార కారణతనుః శక్తి ర్జగద్వ్యాపినీ
యద్బీజాత్మకతాం గతా తవ శివే తన్నౌమి బీజం పరమ్ ॥ ౧౦

**ప్రతిపదార్థము:-** హే శివే- ఓ శివశక్తీ, సర్గసమయే-సృష్టి ప్రారంభ కాలమున, సర్వతః- అన్నివైపుల నుంచి, సర్వమ్-సమస్తమును, సంవ్యశ్నువానా-వ్యాపించుచున్నదై, అంతరా- తర్వాత, తత్తత్- ఆయా, దివ్య-దైవ సంబంధమైన, హృషీక

- జ్ఞానేంద్రియ కర్మేంద్రియముల యొక్క, కర్మభిః- పనులచేత, కార్యేన్ద్రియాణి - జ్ఞానేంద్రియ కర్మేంద్రియములను, సంవ్యశ్నువానా- వ్యాపించుచున్నదై, వాగర్థ - శబ్దార్థముల యొక్క, వ్యవహార- ప్రవృత్తియందు, కారణ- కారణమైన, తనుః - శరీరము గలదియు, జగత్- ప్రపంచమునందు, వ్యాపినీ- వ్యాపించునదియు, పరాశక్తిః- ఆ పరాశక్తి, యద్బీజాత్మకతామ్- ఏ బీజస్వరూపమును, గతా- పొందినదో, తత్- ఆ, తవ- నీ యొక్క, పరమ్-గొప్ప, బీజమ్- బీజమును, నౌమి- నమస్కరించెదను.

**తాత్పర్యము:** - ఓ మహాశక్తీ, క్రియాశక్తిరూపమైన నీ 'పరాశక్తి' సృష్టి సమయమున సర్వ విధములుగా సర్వ వస్తువులందు ప్రవేశించినది. సృష్టించినది. ఇంద్రియశక్తి రూపముగా ఇంద్రియములందు ప్రవేశించినది. ఇంద్రియక్రియారూపముగా పరిణమించినది. శబ్దము అర్థము అను రూపముల సంతరించుకొని లోక వ్యవహారమునకు కారణమైనది. ప్రపంచమంతయు వ్యాపించిన యీ శక్తి తుదకు నీ శక్తిబీజముగా అవతరించినది. గింజచెట్టుగా వ్యాపించి మఱల గింజలుగా రూపుచెందును గదా! అట్లు ఘనీభవించిన నీ 'సౌః' అను శక్తిబీజమునకు నమస్సు.

**విశేషములు:** -

౧. అనంత స్థూల సృష్టిరూపము ఈ శక్తిబీజము. సృష్టి ప్రారంభమునుంచియే సర్వవిధముల సర్వసృష్టిలోనికి ప్రవేశించి శక్తిరూపముగా నుండి సర్వేంద్రియ వ్యాపారములను జరిపించును. తద్ద్వారా శబ్దములు వాటిచే సూచింపబడు అర్థములను ఈ బీజమే సృష్టించి నడిపించును. ప్రపంచవ్యాపిని అయిన ఆ పరాశక్తి 'బీజ' రూపము దాల్చినది. ఆ బీజమే 'సౌః' అను శక్తిబీజము.

౨. జగద్వ్యాపినీ అనగా జగత్తునందలి 'త్రిపుటి' అంతయు శక్తి విలాసమే.

1. కార్యము- కారణము- కర్త 2. జ్ఞేయము- జ్ఞానము- జ్ఞాత
3. వాచ్యము- వచనము- వక్త 4. సకారము- ఔకారము- విసర్గ

3. పరాశక్తి సృష్టి సమయమున కామకలాక్షరమునుండి ఆవిర్భవించును. సమస్త పదార్థములను సృజించును. అనేక దేవతలను సృజించును. ఆ దేవతలకు స్థానములైన ఇంద్రియములను నిర్మించును. శబ్దార్థములను నిర్వహించును. తరువాత

పరాబీజముగా (సౌః)గా ఉండిపోవును.

**అవతారిక:**-పరాశక్తి బీజస్మరణమువలన పరదేవత సాక్షాత్కరించును అని ఇందులో చెప్పుచున్నాడు.

శ్లో॥ అగ్నీన్దు ద్యుమణి ప్రభఞ్జనధరా నీరాన్తరస్థాయినీ
శక్తి ర్బ్రహ్మ హరీశ వాసవ ముఖామర్త్యాసురాత్మస్థితా ।
సృష్ట స్థావర జఙ్గమ స్థిత మహాచైతన్యరూపా చ యా
యద్బీజస్మరణేన సైవ భవతీ ప్రాదుర్భవత్యమ్బికే ॥ ౧౧

**ప్రతిపదార్థము:**- అంబికే- తల్లీ, అగ్నీన్దుద్యుమణి- అగ్ని చంద్ర సూర్యులందు, ప్రభఞ్జన-వాయువునందు, ధరా- భూమియందు, నీరాన్తర- నీటిలోపల, స్థాయినీ- ఉండునట్టిది, బ్రహ్మహరీశ వాసవముఖ- బ్రహ్మ విష్ణు శివ ఇంద్ర మొ॥, అమర్త్య- దేవతల, అసుర- రాక్షసుల, ఆత్మస్థితా- స్వరూపములతో ఉన్నదియు, సృష్ట- సృష్టింపబడిన, స్థావర జఙ్గమ- చరాచరములందు, స్థిత- ఉన్న, మహాచైతన్య రూపా - ప్రాణశక్తి జ్ఞానశక్తి స్వరూపమైన, శక్తిః- పరాశక్తి, యా- ఏది గలదో, సైవ- అదే అయిన, భవతీ- నీవు, యత్- ఏ, బీజ- బీజము యొక్క, స్మరణేన- ధ్యానముచేత, ప్రాదుర్భవతి- ఆవిర్భవించెదవో ఆ బీజమునకు నమస్కరించెదను.

**తాత్పర్యము:**- దేవి సర్వవ్యాపిని. ఆమె లేనిదే స్పందన లేదు. పరమశివునకే స్పన్దన లేదు. ఇక మిగిలిన సృష్టికి స్పందన ఎట్లు. కనుక ఆమె బ్రహ్మనుంచి తృణము వఱకు అంతర్లీనముగా వ్యాపించియున్నది. ఆ విధముగా శివుని అష్టమూర్తు లందు ఆమెయే వ్యాపించియున్నది. అగ్ని చంద్ర సూర్య వాయు భూమి జలములందు వ్యాపించిన శక్తి, బ్రహ్మాదిదేవతలందు వ్యాపించిన శక్తి, చరాచర జగత్తునందు చైతన్యరూపముగానున్న శక్తి- ఈ శక్తులన్నియు , దేవీ, నీ స్వరూపములే. అట్టి పరాశక్తివైన నీవు 'సౌః' బీజస్మరణమువలన ప్రత్యక్ష మయ్యెదవు. అంతటి శక్తివంతమైన నీ 'పరాబీజము'ను స్మరించెదను.

**విశేషములు:**-

శ్రీ నిత్యానందుల సంస్కృత వ్యాఖ్యానమున ఇట్లున్నది.

'త్వం చంద్రికా శశిని తిగ్మరుచౌ రుచిః త్వమ్
త్వం చేతనాసి పురుషే యవనే బలం త్వమ్।
త్వం స్వాదుతాసి సలిలే శుచిని త్వ మూష్మ
నిస్సార మేతదఖిలం త్వదృతే యది స్యాత్'॥

అనగా- దేవీ, నీవు వెన్నెలవు. సూర్యకాంతివి. పురుషునియందు చేతనవు. యవనునియందు బలము నీవు. నీటియందు రుచివి. అగ్నియందు వేడిమివి. కనుక, తల్లీ, నీవులేనిదే ఈ ప్రపంచమంతయు నిస్సారమే.

౨. సర్వావయవ సమగ్రమయిన శరీరములన్నియు ప్రాణము, స్పృహలేనిచో నిరుపయోగమగును. వెన్నెలలేని చంద్రుడు, కాంతిలేని సూర్యుడు ఎంతో, ప్రాణములేని శరీరము అంత. కనుకనే 'సౌందర్యలహరి' లో

'శివః శక్త్యా యుక్తో యది భవతి శక్తః ప్రభవితుమ్'

అని ఆచార్య శ్రీశంకరులు అన్నారు. కనుక దేవి సర్వచైతన్యరూపురాలు. దేవీభాగవతమున-

'సర్వచైతన్యరూపాంతాం ఆద్యాం విద్యాం చ ధీమహి బుద్ధిం యానః ప్రచోదయాత్' అని చెప్పబడెను. సూర్యకాంతి 'సావిత్రి'గా గాయత్రిగా చెప్ప బడుట గూడా శక్తి పారమ్యమునకే గుర్తు.

**అవతారిక:** - బీజత్రయరూపమైన పరాబీజమే ఐశ్వర్య పాండిత్య మోక్షములను అనుగ్రహించునని చెప్పుచున్నాడు.

శ్లో॥ స్వాత్మశ్రీ విజితాజ విష్ణు మఘవ శ్రీపూరణైకవ్రతమ్
యద్విద్యా కవితావితాన లహరీ కల్లోలినీ దీపకమ్।
బీజం యత్త్రిగుణ ప్రవృత్తి జనకం బ్రహ్మేతి యద్యోగినః
శాన్తాః సత్య ముపాసతే తదిహ తే చిత్తే దధే శ్రీపరే ॥ ౧౨

**ప్రతిపదార్థము:** - శ్రీపరే- ఓ పరాభట్టారికా!, యత్- ఏ బీజము, స్వ- తన యొక్క, ఆత్మ- స్వరూపమైన 'సౌః' యొక్క, శ్రీ- శక్తిచేత, విజిత- జయింప బడిన, అజ- బ్రహ్మయొక్క, విష్ణు- విష్ణువు యొక్క, మఘవ- ఇంద్రునియొక్క,

శ్రీ-సంపదలను, పూరణ-పూరించుటయే, ఏకవ్రతమ్-ప్రధానవ్రతము గలదో, యత్-ఏ బీజము, విద్యా-విద్యలు, కవితా-కవితలు అను వీటియొక్క, లహరీ -ప్రవాహములు అనే, కల్లోలినీ-2 నదులమధ్య, దీపకమ్-మధ్యన వెలుగు నిచ్చు దీపము వంటిదో, యత్-ఏ బీజము, త్రిగుణ-సత్వ రజః తమోగుణముల యొక్క, ప్రవృత్తిః-ప్రవర్తనను, జనకమ్-కల్గించునదియో, యత్-ఏ బీజమును, యోగినః-యోగులు, శాన్తాః-శాంతులై, సత్యమ్-శాశ్వతమైన, బ్రహ్మ-పర బ్రహ్మమని, ఉపాసతే-ఉపాసించుచున్నారో, తత్-ఆ, తే-నీ యొక్క, బీజమ్-'సౌః' బీజమును, ఇహ-ఈ, చిత్తే-నా మనస్సునందు, దధే-ధరించెదను.

**తాత్పర్యము:-** శ్రీవిద్యా పరాభట్టారికా! నీ 'సౌః' బీజము ముందఱ దీనులై యున్న బ్రహ్మాది దేవతలను దయతలచి వారికి శక్తిని ప్రసాదించెదవు. ప్రపంచమున శాస్త్రము మొ॥ విద్యలు ఒకవంక, మఱొకవంక కవితలు గలవు. ఈ రెండు, రెండు ప్రవాహాలు,రెండు నదులు. ఈ రెండింటికి సమానముగా వెలుగునిచ్చు దీపము నీ బీజము. గడపలో బెట్టిన దీపము ఇంటికి వాకిలికి ఉపయోగపడినట్లు నీ బీజము అటు విద్యలకు ఇటు కవితలకు అవసరమైన ప్రకాశమును ఇచ్చును. త్రిగుణాత్మకమైన ప్రపంచమునకు ఇదే మూలము. ఇదే ఉపాసకులకు సత్యమైన 'బ్రహ్మము'. అట్టి నీ 'సౌః' బీజమును ధ్యానించెదను.

**విశేషములు:-**

'సౌః' అధోబీజము. స్థూలసృష్టి సంకేతము. దీనియందు తమః ప్రాధాన్యము ఉండవలెను. ప్రధానంగా 'శక్తి'కి సంకేతము. అనగా

౧. బీజవిభాగము ఖండవిభాగము సౌకర్యము కొఱకు చేయబడినది. నిజము నకు మొత్తము దేవీ స్వరూపమే. మనము వేఱు మన కాళ్ళు వేఱు అని పూర్తిగా భావింపలేము కదా! కనుక ఏ బీజమైనను పరాశక్తిరూపమే కనుక అది సర్వ సమర్థమని చెప్పవలెను.

౨. సృష్టియందు త్రిగుణము లుండును. అట్లే 'ఐం' బీజశక్తి 'క్లీం' బీజమునందు దిగును. 'ఐం,క్లీం' బీజముల శక్తులు 'సౌః' లోనికి దిగును.' సత్వము రజస్సు,

తమస్సు' సృష్టిలోనికి పంచీకరణము ద్వారా ఏదో ఒక అంతరువులో దిగును. కనుక 'సౌః' బీజమునందున్న 'ఐం' శక్తివలన సాత్విక దేవతానిర్మాణము జరుగును. 'క్లీం' వలన కోరికలు విద్యలు సిద్ధించును. కనుక 'సౌః' బీజమునందు పై శక్తులను వర్ణించుట యుక్తమే.

**అవతారిక:**- 'వన్దే వాగ్భవ.... వద్ద నుంచి స్వాత్మ శ్రీ.... వఱకు ౧౦ శ్లోకములలో సంకేతసారమైన లలితా విద్యను, త్రికూటసారమైన బాలా విద్యను వర్ణించి ఇప్పుడు అందలి అక్షరములు ఒక్కటియైనను అనంతఫలము నిచ్చునని చెప్పుచున్నాడు.

శ్లో॥ ఏకైకం తవ మాతృకే పరతరం సంయోగి వా యోగి వా
విద్యాది ప్రకటప్రభావజనకం జాడ్యాన్ధకారాపహమ్।
యన్నిష్ఠాశ్చ మహోత్పలాసన మహావిష్ణు ప్రహర్త్రాదయో
దేవాః స్వేషు విధిష్వనన్య మహిమ స్ఫూర్తిం దధత్యేవ తత్॥ ౧౩

**ప్రతిపదార్థము:**- మాతృకే- మాతృకాస్వరూపమైన శ్రీమాతా!, యన్నిష్ఠాః- ఏ బీజముల యందు ఉన్నవారై, మహోత్పలాసన- బ్రహ్మ, మహావిష్ణు- శ్రీహరియు, ప్రహర్త్రాదయః- రుద్రుడు మొ॥ లోకేశ్వరులు అయిన, దేవాః చ- దేవతలు గూడా, స్వేషు- తమ తమ, విధిషు- సృష్టి పాలన సంహారాది క్రియలందు, అనన్య- ఇతర దుర్లభమైన, మహిమ- మహత్వము యొక్క, స్ఫూర్తిమ్ -స్ఫురణను, దధత్యేవ- ధరించియే యున్నారు, తత్- ఆ కారణమున, తవ- నీ యొక్క బీజము, ఏకైకమ్- ఒకటొక్కటె కాని, సంయోగి వా- హల్లులతో గూడినది గాని, అయోగి వా- హల్లులు లేనిది గాని, పరతరమ్- శ్రేష్ఠమైనది, విద్యాది- విద్య మొ॥ వాని యొక్క, ప్రకట- స్ఫుటమైన, ప్రభావ- మహిమను, జనకమ్- కలిగించునట్టిది, జాడ్య- అజ్ఞానము అనే, అంధకార- చీకటిని, అపహమ్- పోగొట్టునట్టిదని తెలియుచున్నది.

**తాత్పర్యము:**- మాతృకాచక్రాధీశ్వరీ, బ్రహ్మ విష్ణువు రుద్రుడు మొదలగు దేవతలు నీ బీజములందు ఒక్కొక్క దానియందు నివసించియే యీ సృష్టి క్రమమును చక్కగా నిర్వహించుచుండిరి. 'ఐం'కారమునందు బ్రహ్మ, 'క్లీం'

కారమునందు విష్ణువు, 'సౌః' కారమునందు రుద్రుడు ఉండి తమ విధులను నిర్వర్తించు జ్ఞానశక్తులను పొందిరి. సంహారముగూడా 'సౌః' తోనే మొదలు కావలెను కనుక, అచ్చట రుద్రుడున్నట్లు భావన. కనుక బీజములు 'మూటిలో' ఏ ఒక్కటైనను అనంత శక్తి ఫలదమే అని దీనినిబట్టి తెలియుచున్నది. అట్టి నీ బీజత్రయమునకు నమస్కారము.

**విశేషములు:-**

'వాగీశ్వరీ జ్ఞానశక్తిః వాగ్భవే మోక్షరూపిణీ
కామరాజే క్రియాశక్తిః కామేశీ కామరూపిణీ
శక్తిబీజే పరాశక్తిః ఇచ్ఛైవ శివరూపిణీ' - అని సౌభాగ్య భాస్కరము.

**అవతారిక:**-3 బీజములను, 3 కూటములను తెలిసికొన్న వాని అదృష్టమును ఇందు చెప్పుచున్నాడు.

శ్లో॥ ఇత్థం త్రీణ్యాపి మూల వాగ్భవ మహా శ్రీకామరాజ స్ఫురత్
శక్త్యాఖ్యాని చతుః శ్రుతి ప్రకటితా న్యుత్కృష్టకూటాని తే।
భూతర్తు శ్రుతి సఙ్ఖ్య వర్ణ విదితా న్యారక్తకాన్తే శివే
యో జానాతి స ఏవ సర్వజగతాం సృష్టి స్థితి ధ్వంసకృత్॥ ౧౪

**ప్రతిపదార్థము:**-ఆరక్తకాన్తే- అరుణకాంతిగలదానా, శివే-పార్వతీ, ఇత్థమ్- ఈ విధముగా, చతుః శ్రుతి-నాల్గు వేదములచే, ప్రకటితాని- ప్రకటింపబడినవి, ఉత్కృష్ట-గొప్ప, కూటాని- ఖండములు గలదియు, భూత-5, ఋతు-6, శ్రుతి-4, సంఖ్య-సంఖ్యలు గల, వర్ణ- అక్షరములతో, విదితాని- ప్రసిద్ధములైనవియు, మూల వాగ్భవ- వాగ్భవకూటము వాగ్భవబీజము, మహా శ్రీకామరాజ-కామరాజకూటము కామరాజబీజము, స్ఫురచ్ఛక్త్యాఖ్యాని-శక్తికూటము శక్తిబీజము అను పేర్లుగల, తే- నీ యొక్క, త్రీణ్యాపి- మూడుకూటములను మూడుబీజములను గూడా, యః- ఏ సాధకుడు, జానాతి- తెలిసికొనునో, స ఏవ ఆ సాధకుడే, సర్వజగతామ్- సమస్త ప్రపంచములయొక్క, సృష్టిస్థితి ధ్వంస -సృష్టి పాలన ప్రళయములను, కృత్-చేయువాడు అగును.

**తాత్పర్యము:**- అరుణా దేవీ!, వాగ్భవ,కామరాజ,శక్తి బీజములు నీ బాలా విద్యవి. వాగ్భవ కామరాజ శక్తి కూటములు నీ సంకేతసార విద్యవి. సంకేతసార విద్యయందు అక్షరములు 15. అందు వాగ్భవకూటమునందు 5, కామరాజ కూటమునందు 6, శక్తికూటమునందు 4, మొత్తము 15 అక్షరములు గలవు. ఈ మూడు కూటములు, ఆ 3 బీజములు వేదములందు చెప్పబడినవి. వీని తత్త్వము తెలిసినవాడు కామేశ్వరునితో సమానముగా సృష్టిస్థితిలయములు చేయగలడు.

**విశేషములు:**-

౧.'కామోయోనిః కమలా వజ్రపాణిః గుహా హ సా మాతరిశ్వాభ్ర మింద్రః।
పునర్గుహా సకలా మాయయా చ పురూచ్యేషా విశ్వమాతాది విద్యా॥
అని అథర్వవేదమున సౌభాగ్యకాండమున పరోక్షపదములలో పఞ్చదశి చెప్పబడినది.

**కామః-క, యోనిః-ఏ, కమలా-ఈ, వజ్రపాణిః-ల, గుహా-హ్రీం, హ సా-హ,స; మాతరిశ్వా-క, అభ్రమ్-హ, ఇంద్రః-ల, గుహా-హ్రీం, సకలా-స,క,ల; మాయా-హ్రీం.**

౨. ఋగ్వేదమున 'ఇంద్రోమాయాభిః పురురూప ఈయతే' అని కలదు. అనగా ఇంద్రుడు మాయలచే బహురూపుడుగా పొందబడుచున్నాడు అని అర్థము. మాయా అనగా ఇచ్చట మంత్రవర్ణములు అని సందర్భమునకు సమన్వయము చేయవలయును. మాయ, శక్తి, నాదము, విద్య - ఇవి సమాన దేవతావాచకములు.

3.దేవతను ఆరాధించువాడు దేవతయే అగును. కాన తాదాత్మ్యార్చన చేయ వలయును. 'దేవతయే నేను, నేనే దేవతను' అను తాదాత్మ్యము భావించ వలయును. అట్టి వానికి 'పంచదశి, పాదుకాంతదీక్ష, పూర్ణాభిషేకము' జరుగును. ఇట్టి వాడు దేవతయే. వీనికి దేవతచేయు సృష్టిస్థితిలయాదులు చేయు శక్తి వచ్చును. విశ్వామిత్రుడు ప్రతిసృష్టి యొనర్చుట ఇందు కుదాహరణము. అభేదము సిద్ధించిన తరువాతవీడే దేవత. తేడా లేదు. కనుక దేవత చేయు

సృష్టి స్థితి లయాదులు అన్నియు వీడుగూడా చేసినట్లే లెక్క.
౪. జీవన్ముక్తుడైన వానికి ప్రారబ్ధ భోగాంతము శరీరము ఉండును. ఆ స్థితిలో వానికి బ్రహ్మమునకు భేదములేదు. అయినను పరమాత్మకున్న జగత్కర్తృత్వాదులు ఈతనికి సిద్ధింపవు అని వేదాంతి మతము. ఆచార్యులు చెప్పినట్లు 'సాముద్రో హి తరంగః, క్వచన సముద్రో న తారంగః' అనగా- సముద్రము తరంగము ఒక్కటే యైనను సముద్రము తరంగము కాదు. తరంగము సముద్రమంతటిది కాదు.

**అవతారిక:-** శ్రీవిద్యాకూటత్రయమును, బీజత్రయమును ఎఱిగినంత మాత్రమున '14'వ శ్లోకమున చెప్పినట్లు శక్తులు లభించినచో, ఇక, శివుడు తంత్రములలో పదే పదే చెప్పిన 'నిత్యోపాసన' సంగతి ఏమిటి? ఎందుకు? అని ప్రశ్న వచ్చినది. అందుకు సమాధానము ఇందు చెప్పుచున్నాడు.

శ్లో॥ నిత్యం యస్తవ మాతృకాక్షరసఖీం సౌభాగ్యవిద్యాం జపేత్
సమ్పూజ్యాఖిల చక్రరాజనిలయాం సాయన్తనాగ్ని ప్రభామ్ ।
కామాఖ్యం శివనామతత్త్వ ముభయం వ్యాప్యాత్మనా సర్వతో
దీవ్యన్తీ మిహ తస్య సిద్ధి రచిరాత్ స్యా త్తత్స్వరూపైకతా ॥ ౧౫॥

**ప్రతిపదార్థము:-** అఖిల చక్రరాజ- సమస్త శ్రీచక్రమే, నిలయామ్- నివాసముగా గలదియు, సాయన్తన- సాయంకాలపు, అగ్నిప్రభామ్- అగ్నిజ్వాలవంటిదియు, కామాఖ్యమ్- 'కామ' అను పేరుగల, శివనామతత్త్వమ్- ఈశ్వర అను పేరుగల తత్త్వమును, ఉభయమ్- ఈ రెంటిని, ఆత్మనా- తన శరీరముతో, వ్యాప్య- వ్యాపించి, సర్వతః- అన్నివిధముల, దీవ్యన్తీమ్- ప్రకాశించుచున్న నిన్ను, సంపూజ్య- పూజించి, యః- ఏ సాధకుడు, మాతృకాక్షర- శరీరము లోపలనున్న చక్రాక్షరములే, సఖీమ్- చెలికత్తెలుగా గల, తవ- నీ, సౌభాగ్యవిద్యామ్- పంచదశిని, నిత్యమ్- నిత్యము, జపేత్- జపించునో, తస్య- వానికి అచిరాత్- త్వరలోనే, త్వత్- నీ, స్వరూపైకతా- సారూప్యము అను, సిద్ధిః- ఫలసిద్ధి, ఇహ - ఇచ్చట, స్యాత్- కలుగును.

**తాత్పర్యము:**-సాయంకాలపు అగ్నిప్రభవలె వెలుగుచున్న శ్రీచక్రరాజనిలయ వైన నిన్ను, కామ ఈశ్వరతత్త్వములు రెంటియందు వ్యాపించిన నీ కామేశ్వరీ తత్త్వమును ధ్యానించి అర్చించి అంతర్మాలలో నీ సౌభాగ్యవిద్యేశ్వరీ జపము చేయు సాధకునకు ఈ లోకముననే నీ సారూప్యముక్తి శీఘ్రము కలుగును.

**విశేషములు:-**

౧.సాయంకాల అగ్ని ప్రభ - అనగా, సాయంకాలమున అగ్నికి వెలుగు పెరుగును. అందువలన సాయంకాలాగ్నితో తల్లిని పోల్చినాడు. లేదా 'యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః' - ఇచట సాయంకాలము యోగి సమాధి ప్రారంభదశను సూచించును. అట్టియెడ జ్వలించు ప్రభ కనుక 'సాయంకాలప్రభ' అని చెప్పెను.

౨.కామతత్త్వము పరమేశ్వరి. శివతత్త్వము నిర్గుణబ్రహ్మాది. రెండును ఒకదాని లో నొకటి ప్రతిబింబించిన తత్త్వము 'కామేశ్వర' తత్త్వము. సృష్ట్యున్ముఖస్థితి. ఈ ప్రతిబింబించుటనే కథాపరముగా 'శివుని ఒడిలో శ్రీమాత' కూర్చొన్నట్లు చెప్పినారు.

3.మాతృకాక్షరములు- అంతర్మాల .. ద్వితీయశ్లోక వ్యాఖ్య చూడుడు.

౪.జపము మూడు విధములు.

1.మానసము- మనసులో అంతర్మాలతో చేయు జపము. దీనితో అర్థము భావింపవలయును. ఇది ఉత్తమ జపము. దిగువ శ్లోకము చూడుడు.

> 'ధియా మంత్రాక్షరశ్రేణీం వర్ణ స్వర పదాత్మికామ్ ।
> ఉచ్చరే దర్థ సంస్మృత్యా స ఉక్తో మానసో జపః ॥

2.ఉపాంశువు- పెదవులు కదలుచు అస్పష్టనాదముతో గొణుగుచున్నట్లు చేయు జపము. ఇది మధ్యమ జపము.

3.వాచికము-పైకి పెద్దగా అక్షరాలు వినబడే జపము. ఇది అధమ జపము.

౫.అఖిలచక్రరాజనిలయాం సంపూజ్య- అనగా శ్రీచక్రమునందు త్రికోణ మధ్యమున దేవిని మాత్రమే కాక నవావరణములందలి దేవతలను పూజింప వలయును.

**అవతారిక:** - స్వల్పమైన 'కావ్య వ్యాకరణాది' పాండిత్యము గూడా దేవీ ప్రసాదము వలన సిద్ధించునని చెప్పుచున్నాడు.

శ్లో॥ కావ్యైః పాపఠితైః కిమల్పవిదుషాం జోఘుష్యమాణైః పునః
కిం తైః వ్యాకరణైః విబోధితతయా కిం వాభిధానశ్రియా।
ఏతై రమ్బ! న బోభవీతి సుకవిః తావత్తవ శ్రీమతోః
యావ న్నానుసరీసరీతి సరణిమ్ పాదాబ్జయోః పావనీమ్ ॥ ౧౬

**ప్రతిపదార్థము:** - అంబ-తల్లీ, అల్పవిదుషామ్-స్వల్పపాండిత్యముగల కవుల యొక్క, పాపఠితైః-బాగా చదువబడిన, కావ్యైః-కావ్యములతో, కిమ్-ఏమి ప్రయోజనము, జోఘుష్యమాణైః-మాటి మాటికి ప్రకటింపబడుచున్న, తైః-ఆ, వ్యాకరణైః పునః-వ్యాకరణములతోనయితే, కిమ్-ఏమి లాభము, అభిధాన -నిరుక్తము యొక్క, శ్రియా-సంపదతో, విబోధితతయా-బోధింపబడుటచే, కిం వా-ఏమి ప్రయోజనమో?, శ్రీమతోః-శ్రీమంతములైన, తవ-నీ, పాదాబ్జయోః-పాదాంబుజముల యొక్క, పావనీమ్-పవిత్రమైన, సరణిమ్-మార్గమును, యావత్-ఎంతవఱకు, నానుసరీసరీతి-అనుసరింపదో, తావత్-అంతదాక, ఏతైః-ఈ కావ్య వ్యాకరణాదులచేత, సుకవిః-మంచికవి, నబోభవీతి -కాలేడు.

**తాత్పర్యము:** - తల్లీ, ఎన్ని కావ్యములు ఎన్ని సార్లు చదివినను, ఎన్ని వ్యాకరణములు ఎంతబాగా చదివినను, ఎన్ని నిరుక్తములను నిఘంటువులను వల్లెవేసినను ప్రయోజనము లేదు. ఆ వ్యక్తి మహాకవి కాలేడు. పవిత్రమైన నీ పాద సరోజ సన్నిధిని ఆశ్రయించనంతవఱకు అతడు సుకవి గానేరడు.

**విశేషములు:** -

దేవి మహాసరస్వతి. 'క్లీం' బీజాధ్యక్షురాలు, 'ఐం' బీజాధిపతి. ఆమె దయలేనిదే ఏ కోరిక తీఱదు. ఏ చదువున్ను రాదు. ఈ విషయమునే ఆచార్య శ్రీ శంకరులు

శరజ్జ్యోత్స్నా శుద్ధాం శశియుతజటాజూటమకుటాం
వరత్రాసత్రాణ స్ఫటిక ఘుటికా పుస్తకకరామ్।

సకృన్నత్వా నత్వా కథమివ సతాం సన్నిదధతే
మధుక్షీరద్రాక్షా మధురిమ ధురీణాః ఫణితయః ॥(సౌందర్యలహరి)

అని చెప్పిరి. అనగా, శుభ్రవర్ణ అయిన సారస్వతరూపముగల దేవిని ఒక్కసారి అయినా ధ్యానింపనిదే మధురఫణితిలో కవితలు రావు అని అర్థము.

**అవతారిక:**-దేవీ సేవకులకు అనిష్టములు ఇష్టములుగా మారునని ఇందు చెప్పుచున్నాడు.

శ్లో॥ గేహం నాకతి గర్వితః ప్రవణతి స్త్రీసఙ్గమో మోక్షతి
ద్వేషీ మిత్రతి పాతకం సుకృతతి క్ష్మావల్లభో దాసతి ।
మృత్యుర్వైద్యతి దూషణం సుగుణతి త్వత్పాద సంసేవనాత్
త్వాం వన్దే భవభీతి భఞ్జనకరీం గౌరీం గిరీశప్రియామ్ ॥ ౧౭

**ప్రతిపదార్థము:**-త్వత్- నీ, పాదసంసేవనాత్-పాదసేవ వలన, గేహమ్-ఇల్లు, నాకతి-స్వర్గముగా అగు చున్నది, గర్వితః-గర్వాంధుడు, ప్రవణతి-అనుకూలుడగును, స్త్రీసంగమః-స్త్రీసంగము, మోక్షతి-మోక్షముగా అగును, ద్వేషీ-శత్రువు, మిత్రతి-మిత్రుడగును, పాతకమ్-పాపము, సుకృతతి-పుణ్యముగా అగును, క్ష్మావల్లభః-భూపతి, దాసతి-దాసుడగును. మృత్యుః-మృత్యుదేవత, వైద్యతి-వైద్యుడుగా మారును, దూషణమ్-నింద, సుగుణతి-సద్గుణముగా మారును, భవభీతి-సంసారభయమును, భఞ్జనకరీమ్-పోగొట్టునదియు, గిరీశ -శివునకు, ప్రియామ్-ప్రేయసియగు, గౌరీమ్-గౌరివయిన, త్వామ్-నిన్ను, వన్దే-నమస్కరించుచున్నాను.

**తాత్పర్యము:**-తల్లీ! నీ సేవకుడై జీవన్ముక్తుడైన వానికి ఈ లోకమున అనిష్టము అనునది లేదు. అన్నియు ఇష్టములుగానే మారును.

**విశేషములు:**-

జీవన్ముక్తునకు కావలసినవి లేవు. అక్కరలేనివి లేవు. రాగద్వేషములు లేవు. కనుక అతనికి గృహమే స్వర్గసీమ. ఎందువలన? అతనికి గృహమున బాధలేదు. స్వర్గమున సుఖములేదు. సుఖదుఃఖ వివక్షలేదు గదా! అంతేగాక దేవీ దయవలన సర్వమూ వశమగును. 'క్లీం' బీజము కామరాజబీజము. దానివలన 'జన

వశీకరణము' జరుగును. మృత్యువువలన శరీరబంధము వదలి సంసారరోగము నశించును గనుక మృత్యువు వైద్యుడు అగును. నిందవలన తన యందలి దోషములు తెలిసికొను అవకాశము వచ్చును కనుక అది 'సుగుణము' అగును. ఈ ఉపాసకులు మానవాకార దేవతలు అని భావము.

**అవతారిక:**-కామకలాక్షరమునందుగల బిందుత్రయమును వ్యాఖ్యానించు చున్నారు.

శ్లో॥ ఆద్యై రగ్ని రవీన్దు బిమ్బనిలయై రమ్బ! త్రిలిఙ్గాత్మభి-
ర్మిశ్రా రక్తసితప్రభై రనుపమై ర్యుష్మత్పదై స్తైస్త్రిభిః।
స్వాత్మోత్పాదితకాలలోక నిగమావస్థామరాదిత్రయై-
రుద్భూతం త్రిపురేతి నామ కలయే ద్య స్తే స ధన్యో బుధః ॥ ౧౮

**ప్రతిపదార్థము:**-అమ్బ-తల్లీ, ఆద్యైః-సృష్టి ప్రారమ్భము నందలివియు, అగ్ని రవీన్దు బిమ్బ-అగ్ని సూర్య చంద్ర బింబములే, నిలయైః-నివాసములుగా గలవియు, త్రిలింగాత్మభిః-లింగత్రయ స్వరూపములైనవియు, మిశ్రా రక్తసిత ప్రభైః-మిశ్రమవర్ణము, అరుణవర్ణము, ధవళవర్ణము గలవియు, అనుపమైః-పోలిక లేనివియు, యుష్మత్పదైః-మీకు స్థానమ్మైనవియు, స్వ-తమ యొక్క, ఆత్మ-బిందుత్రయమునుండి, ఉత్పాదిత-పుట్టింపబడిన, కాల-కాలములు, లోక-లోకములు, నిగమ-వేదములు, అవస్థా-దశలు, అమర-దేవతలు, ఆది-మొదలగు వారి యొక్క, త్రయైః-త్రయములు గలవియు అగు, తైః-ఆ, త్రిభిః-మూడుబీజములచేత, మూడు ఖండములచేత, ఉద్భూతమ్-పుట్టిన, త్రిపురా ఇతి-త్రిపురా అను, తే-నీ, నామ-పేరును, యః-ఎవడు, కలయేత్-గ్రహించునో, సః-ఆ, బుధః-పండితుడు, ధన్యః-ధన్యుడు.

**తాత్పర్యము:**-అమ్మా! అత్యంత ప్రాచీనమైన నీ బీజత్రయము అగ్ని సూర్య చంద్ర బింబనిలయములు. అవి స్వయంభూ, బాణ, జ్యోతి ర్లింగ స్వరూపములు. వరుసగా పాటల, అరుణ, ధవళ వర్ణమైనవి. వీటినుండియే ప్రపంచమున చాలా 'త్రయములు' వచ్చినవి.

'ఐం' - భ్రూమధ్యము - జ్యోతిః - ధవళ - చంద్ర
'క్లీం' - హృదయము - బాణ - అరుణ - రవి
'సౌః' - మూలాధారము - స్వయంభూ - పాటల - అగ్ని
వీటినుండి

1. కాలత్రయము - ప్రాతః మధ్యాహ్న సాయంకాలములు
2. లోకత్రయము - స్వర్గ మర్త్య పాతాలలోకములు
3. వేదత్రయము - ఋక్ యజుః సామములు
4. అవస్థాత్రయము - జాగ్రత్ స్వప్న సుషుప్తులు
5. అమరత్రయము - బ్రహ్మ విష్ణు రుద్రులు
6. వహ్నిత్రయము - గార్హపత్య ఆహవనీయ దక్షిణాగ్నులు
7. శక్తిత్రయము - ఇచ్ఛా జ్ఞాన క్రియాశక్తులు
8. పీఠత్రయము - కామగిరి జాలంధర పుష్పగిరులు

ఈ త్రయములు ఆవిర్భవించినవి. అందువలన ఈ బీజత్రయ, కూటత్రయ మంత్రమునకు అధిష్ఠాన దేవత అయిన 'లలిత'ను 'త్రిపుర' అందురు. ఈ త్రిపురను గుర్తించి ఉపాసించిన బుధుడు ధన్యుడు.

**విశేషములు:-**

౧. 'త్రిపుర' అనగా **కామకలావిలాస** వ్యాఖ్య 'చిద్వల్లి' లో నొక శ్లోకము కలదు.

'త్రిమూర్తిసర్గాచ్చ పురోభవత్వాత్
త్రయీమయత్వాచ్చ పురైవ దేవ్యాః।
లయే త్రిలోక్యా అపి పూరణాచ్చ
ప్రాయోంబికాయాః **త్రిపురేతి** నామ॥

అనగా త్రిమూర్తులకన్న ముందున్నది. పూర్వమే వేదత్రయ స్వరూపము గలది. త్రిలోకములను పూరించియున్నది. కనుక ఆమెకు 'త్రిపురా' అని పేరు. త్రి అనగా 3. పురా = పూర్వము, పట్టణము, దేహము, పూరించునది అని అర్థము.

**అవతారిక:**- పంచదశియందలి కూటత్రయము ప్రణవములోని త్రయముతో

సమానమని చెప్పుచున్నాడు.

శ్లో॥ ఆద్యో జాప్యతమార్థవాచకతయా రూఢః స్వరః పఞ్చమః
సర్వోత్కృష్టతమార్థవాచకతయా వర్ణః పవర్గాన్తకః।
వక్తృత్వేన మహావిభూతి సరణి స్వాధారగో హృద్గతో
భ్రూమధ్యస్థిత ఇత్యతః ప్రణవతా తే గీయతే చాగమైః ॥ ౧౯

**ప్రతిపదార్థము:-** ఆద్యః-మొదటిదయిన అకారబీజము, జాప్యతమార్థ-జపింపవలసిన విషయమునకు, వాచకతయా-చెప్పునదిగా, రూఢః-ప్రసిద్ధమై, ఆధారగః-మూలాధారమున యున్నది, పంచమః-'అ' నుంచి ఐదవదియైన 'ఉ' అను అచ్చు, సర్వోత్కృష్టతమార్థ-పరమార్థమైన విషయమునకు, వాచకతయా-చెప్పునదిగా, రూఢః-ప్రసిద్ధమై, హృద్గతః-హృదయచక్రగతమైనది, పవర్గాన్తకః-పవర్గలో చివరిదైన, వర్ణః-హల్లు అనగా 'మ్', వక్తృత్వేన-వక్తగా, మహావిభూతి-మహైశ్వర్యమునకు, సరణిః-మార్గమై, భ్రూమధ్యస్థితః-భ్రూమధ్యమునందు గలదు, ఇత్యతః-ఈ కారణమువలన, తే-నీ మంత్రమునకు, ప్రణవతా-దేవత్వము, ఆగమైః-వేదములచే, గీయతే-చెప్పబడుచున్నది.

**తాత్పర్యము:-** అమ్మా! నీ మంత్రము త్రికూటము. నీ మంత్రము త్రిబీజము గూడా. ఓంకారము త్రిబీజము. 'అ+ఉ+మ్'. వీని మధ్య సామ్యమిది.

| ప్రణవము | చక్రము | బీజము | త్రిపుటి |
|---|---|---|---|
| అ | మూలాధారము | సౌః | వాచ్యము, కార్యము |
| ఉ | హృదయ-అనాహత | క్లీం | వాచకము, కారణం |
| మ్ | భ్రూమధ్య-ఆజ్ఞా | ఐం | వక్త, కర్త |

ఈ విధముగా ప్రణవసమానముగా నీ బీజము ఆయా చక్రమునందు ఆయా త్రిపుటులలో సమానముగా నుండుటవలన ఈ మంత్రమును 'ప్రణవము' అని వేదములు చెప్పుచున్నవి. ప్రణవవాచ్యమైన పరబ్రహ్మమే నీవు. వేఱు రూపము కాదు అని తాత్పర్యము.

**విశేషములు:-**

౧.'అ-ఉ-మ్ ఇతి బ్రహ్మ' అని వేదము.

౨.'ఓమిత్యేకాక్షరం బ్రహ్మ' అనియు వేదము.

౩.'అకారో విష్ణురుచ్యతే' అనగా అకారము వ్యాపకబీజము, విశ్వవ్యాపకము విశ్వరూపము.

౪. 'కదాచిదాద్యా లలితా పుంరూపా కృష్ణవిగ్రహా
వేణునాద సమారమ్భాత్ అకరో ద్వివశం జగత్' - (తంత్రరాజము)

'ఒకసారి లలితాదేవి పురుషరూపమున కృష్ణవిగ్రహము దాల్చి వేణునాదముతో ఈ ప్రపంచమును వివశము చేసెను.'

౫. 'అకారః సర్వవర్ణాగ్ర్యః ప్రకాశః పరమః శివః' - (సంకేతపద్ధతి)
'అకారము పరమ శివతత్త్వము ప్రకాశతత్త్వము'.

౬. శివశక్తులు కలసియే యుందురు కనుక అకారము శివుని చెప్పును. ఆయనతో బాటు శక్తిని చెప్పును. మహార్థమంజరి ఇట్లు చెప్పబడినది.

'న శివేన వినా శక్తిః న శక్తిరహితః శివః।
తాదాత్మ్య మనయోః నిత్యం వహ్నిదాహకయోరివ ॥'

'శివుడు లేనిదే శక్తి లేదు. శక్తిలేని శివుడున్ను లేడు. అగ్నికి దాహకత్వశక్తికి తాదాత్మ్యమున్నట్లు శివశక్తులకు తాదాత్మ్మము గలదు. మఱియు, 'ఒకపటము నందు గజవృషభములు 2ఉన్నట్లు ఒకే అక్షరమునందు 'శివశక్తి' ద్వయము కనబడుటలో ఆటంకములేదు. కనుక, 'అ' అనునది త్రిపురసుందరిని చెప్పునని చెప్పవచ్చును. కారణము ఏమనగా ఆమె శివశక్తుల ఐక్య స్వరూపము.

౭.'శ్రీశివా శివశక్త్యైక్యరూపిణీ లలితాంబికా' అని లలితాసహస్రనామము.

౮. 'ఉమేతి పరమా శక్తిః పూర్వభావ ముపేయుషీ
అధ్యుష్టవలయాకారా ప్రణవత్వ ముపాగతా।
అకారరూపిణ్యజరా శివానందా మదద్రవా' ॥(రుద్రయామళము)

'ఉమ అను పరమశక్తి తన పూర్వరూపమును సంతరించుకొనును. ఆ విధము గా వలయాకారమును సంతరించుకొని ప్రణవము గా అగును. ఆమె అకార

రూపిణిగా నుండును.'

అనగా 'ఓం' = అ+ ఉ+ మ్. ఇది దేవి అసలు రూపము. కాని సృష్టికొఱకు పరమ శివశక్తి రూపమైన 'అకారము'తో క్రిందకు కదులును. అపుడు 'ఉ+ మ్+ అ' = 'ఉమ' అగును. ఈమె మూలాధారమునందు 'అకార' రూపముతో ప్రారంభము అయి భుజంగవలయమువలె నుండును.

**అవతారిక:-** 'గాయత్రి' మొదలగు సర్వదర్శనములకు అధిదేవతగా లలితా త్రిపురసుందరినే చెప్పుచున్నాడు.

శ్లో॥ గాయత్రీ సశిరా తురీయసహితా సన్ధ్యామయీత్యాగమై-
రాఖ్యాతా త్రిపురే త్వమేవ మహతాం శర్మప్రదా కర్మణామ్ ।
తత్తద్దర్శన ముఖ్యశక్తిరపి చ త్వం బ్రహ్మ కర్మేశ్వరీ
కర్తార్హన్ పురుషో హరిశ్చ సవితా బుద్ధః శివ స్త్వం గురుః ॥ ౨౦

**ప్రతిపదార్థము:-** త్రిపురే- ఓ త్రిపురాదేవీ, సశిరా- శిరస్సుతో గూడినదియు, తురీయ- ప్రణవముతో, సహితా- కూడినదియు, సంధ్యామయీ- త్రిసంధ్యా కాల స్వరూపురాలైన, గాయత్రీ-గాయత్రి, త్వమేవ- నీవే, ఇతి ఆగమైః- ఆగమములచే, ఆఖ్యాతా-చెప్పబడితివి, త్వమేవ- నీవే, మహతామ్-గొప్ప, కర్మణామ్- జపతపములకు, శర్మప్రదా- సుఖఫలమును ఇచ్చుదానవు, త్వమ్- నీవు, తత్తద్దర్శన- ఆయా దర్శనములయొక్క, ముఖ్య- ప్రధానమైన, శక్తిరపి చ- శక్తివి దేవతవు గూడా, బ్రహ్మ-వేదాంతులకు బ్రహ్మవు, కర్మ- మీమాంసకులకు కర్మవు, ఈశ్వరీ- శాక్తేయులకు ఈశ్వరివి, కర్తా- నైయాయికులకు తార్కికులకు ప్రపంచ కర్తవు, అర్హన్- జైనులకు అర్హంతుడవు, పురుషః- సాంఖ్యులకు పురుషుడవు, హరిః చ- వైష్ణవులకు విష్ణువువు, సవితా- సౌరమతస్థులకు సూర్యుడవు, బుద్ధః- బౌద్ధులకు బుద్ధుడవు, శివః- శైవులకు శివుడవు, గురుః- గాణపత్యులకు గణేశుడవు, త్వమ్- నీవే.

**తాత్పర్యము:-** అమ్మా త్రిపురా! త్రిసంధ్యలలోని సూర్యతేజస్సును గాయత్రిగా ఆరాధించెదము. ఆ గాయత్రికి శిరస్సు గలదు. తురీయపాదము గలదు. అట్టి

గాయత్రి సర్వకర్మలకు మేలు కలిగించును. ఆ గాయత్రియు నీ స్వరూపమే. ఏమనగా దేవి 'ఈ' బీజముగూడ ప్రణవమేయని '8' శ్లోకములో చెప్పబడినది. 'ఈ' అనునది తురీయము. అనగా అకారమునుంచి 4వది. అ ఆ ఇ ఈ కదా! ఇంతేకాక ఆయా దర్శనము లన్నింటికి ముఖ్యశక్తులుగా నున్న దేవతలుగూడా నీ స్వరూపమే. వేదాంతులకు బ్రహ్మ, మీమాంసకులకు కర్మ, శాక్తేయులకు ఈశ్వరి, న్యాయదర్శనము వారికి కర్త, జైనులకు అర్హంతుడు, వైష్ణవులకు విష్ణువు, సౌరమతమువారికి సూర్యుడు, బౌద్ధులకు బుద్ధుడు, శైవులకు శివుడు, గణపతి మతస్థులకు గణేశుడు. వీరందఱు నీ స్వరూపములే. నామభేదమే కాని వస్తుభేదము లేదు.

**విశేషములు:-**

౧.'ఏకం సత్ విప్రా బహుధా వదన్తి' ఉన్న ఒకే సత్తును పండితులు అనేక విధములుగా చెప్పుదురు. అట్లే 'కాళికాశ్రుతి' లో

తస్యా శ్శిఖాయా మధ్యేతు అధ ఊర్ధ్వం వ్యవస్థితాం।
సబ్రహ్మ సశివః సర్వః సఏవ పరమేశ్వరః।
ఇతి కుండలినీం ధ్యాత్వా సర్వపాపైః ప్రముచ్యతే।

౨.తురీయబీజము అనగా 'క్లీం' నందలి 'ఈం'. 'క్లీం' బీజము బిందుత్రయ స్వరూపము. సోమసూర్యఅగ్నిరూపము. ఈ సోమసూర్యఅగ్నులు అకార ఉకార మకారములుగా అవతరించిరి. కనుక ప్రణవము-కార్యము, 'క్లీం'-కారణము. కార్యకారణములకు అభేదమువలన 'ఈం' కారము లేదా 'క్లీం' కారము ప్రణవము.

3.గాయత్రి- త్రిపద అనగా '3' పదములు గలది. ఇది సంధ్యాత్రయమునకు, కాల త్రయమునకు సంకేతము.

౪.సశిరా తురీయ సహితా అనగా ప్రణవమును శిరస్సును కలిగియున్నది అని అర్థము. ఈ '2' కలసినచో పంచమీవిద్యతో సమానమగును. లేదా తురీయ అనగా 4వ పాదము గాయత్రి. లలితలో తురీయ అనగా 'ఈం' బీజము. కనుక 4

కూటముల గాయత్రి షోడశితో సమానము.

ని.'త్రికూట మేకకూటం తు త్రికూటే పంచకూటతా' (వా. తంత్రం)

ఇందు గాయత్రి త్రికూటమంత్రము. దానికి సమానకూటమైన 'భూర్భువ స్సువః' ఏకకూటము. దీనికి త్రికూట సమమైన 'ఓం' కలిపినచో మొత్తము పంచకూటములగును.

త్రికూటం- త్రిపద గాయత్రి.
ఏకకూటం-4వ పాద గాయత్రి.
త్రికూటం- ఓంకారము, కాగా

ఓంకారయుక్త చతుష్పద గాయత్రి పంచకూటమగును.

**అవతారిక:**- కోశపంచక ద్వారా భగవతి విశ్వమునందు అంతర్లీనముగా నున్నదనియు, ఆ విషయమును తెలిసికొనిన వాడు బ్రహ్మజ్ఞాని యగుననియు చెప్పుచున్నాడు.

శ్లో॥ అన్న ప్రాణ మనః ప్రబోధ పరమానన్దైః శిరః పక్షయు
క్పుచ్ఛాత్మ ప్రకటై ర్మహోపనిషదాం వాగ్భిః ప్రసిద్ధీకృతైః।
కోశైః పఞ్చభి రేభి రమ్బ! భవతీ మేతత్ప్రలీనా మితి
జ్యోతిః ప్రజ్వలదుజ్జ్వలాత్మ చపలాం యో వేద స బ్రహ్మవిత్ ॥ ౨౧

**ప్రతిపదార్థము:**- అమ్బ- ఓ తల్లీ, మహోపనిషదామ్- ఉపనిషత్తుల యొక్క, వాగ్భిః-వాక్యములచేత, ప్రసిద్ధీకృతైః- ప్రకటింపబడినవియు, పక్షయుక్-రెండు ఱెక్కలుగా, పుచ్ఛ- తోకగా, ఆత్మ- ఆత్మగా, ప్రకటైః-స్పష్టమైనవియు, అన్న- అన్నము, ప్రాణమనః- ప్రాణమనస్సులు, ప్రబోధ- జ్ఞానము, పరమానందైః- ఆనందముగల, ఏభిః- ఈ, పఞ్చభిః- ఐదయిన, కోశైః- కోశముల ద్వారా, జ్యోతిః- జ్యోతియొక్క, ప్రజ్వలత్- జ్వలించు మంటవలె, ఉజ్జ్వల- వెలుగుచున్న, ఆత్మ- స్వరూపములో, చపలామ్- కదలుచున్న, భవతీమ్- నిన్ను, ఏతత్ -ఈ కోశరూప ప్రపంచమునందు, ప్రలీనామ్ ఇతి- అంతర్లీనమైన దానినిగా, యః- ఏ ఉపాసకుడు, వేద- తెలిసికొనునో, సః- వాడు, బ్రహ్మవిత్- బ్రహ్మవేత్త అగును.

**తాత్పర్యము:**-తైత్తిరీయము మొదలగు ఉపనిషత్తులందు పక్షి ఉపమానముల తో కోశములు వర్ణింపబడినవి. అందు అన్నమయకోశము లోనున్న ఆత్మను గురించి చెప్పబడినది. అన్నముశిరస్సు. ప్రాణమనస్సులు రెక్కలు, ప్రబోధము తోక, ఆనందము దాని ఆత్మ. ఈ విధముగా చెప్పబడిన 5 కోశము లందు ఆత్మరూపమున వెలుగుచున్న నిన్ను తెలిసికొనుట అసాధ్యము. కాని అట్లు తెలిసికొనుట సాధించిన యోగి బ్రహ్మవేత్త అగును. అనగా, దేవి సగుణ బ్రహ్మము. స్త్రీరూపబ్రహ్మము. బ్రహ్మము అనగా వ్యాపించినది. 5 కోశము లందు 5 జీవులుగా ఆత్మలుగా వ్యాపించునదే ఆ 'పరాశక్తి'. ఆ పరబ్రహ్మము కనుక ఆమెను తెలిసినవాడు 'బ్రహ్మవేత్త' యే అగును.

**విశేషములు:**-

౧. దీపము వెలుగునప్పుడు 'జ్వాల' వత్తియందలి పదార్థమును తినునపుడు గాని, నూనెలోతేడావలన గాని, గాలివలన గాని కొద్దిగా కదలికతో నుండును. పరంజ్యోతి అయిన దేవి అన్నమయాది పంచకోశములలో ఆత్మగా వెలుగు చున్నప్పుడు కొంత చపలమైన 'వెలుగు'గా నుండును. ఏలననగా ఇది నిశ్చలమైన ఆత్మజ్యోతి కాదు. కోశాశ్రితమైన జీవజ్యోతి. ఇచ్చట విక్షేపము లుండును. కనుక 'చపలాం' అని వర్ణించెను.

౨. చపలా=విద్యుత్తు అని అర్థము. అనగా మెఱపుతీగవలె మెఱయును. మబ్బుల నాశ్రయించి యున్న 'అపాం నపాత్' అను అగ్ని మెఱపులుగా వచ్చినట్లు పరంజ్యోతి కోశములందు మెఱపులుగా మెఱయుచున్నదని అర్థము.

3. 'బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి' అను శ్రుతివాక్యమువలన దేవీతత్త్వవేత్త బ్రహ్మవేత్త అగును. అనగా 'బ్రహ్మ' యే అగును.

౪. దేవి స్త్రీరూపబ్రహ్మము.

'పుంరూపం వా స్మరేద్దేవం స్త్రీరూపం వా విచిన్తయేత్।
అథ వా నిష్కలం ధ్యాయేత్ సచ్చిదానన్ద లక్షణమ్ ॥'

అనునది సంప్రదాయము. బ్రహ్మానపాయినియైన శుద్ధమాయ కనుక

శ్రీవిద్యోపాసన అనగా 'బ్రహ్మోపాసన' యే అని తెలియవలయును.

**అవతారిక:**-ఈ '21' శ్లోకములందు చెప్పబడిన ఉపాసనలో గురుముఖతః దీక్షగైకొనిన వానికే అధికారమని చెప్పుచున్నాడు.

శ్లో॥ సచ్చిత్తత్త్వమసీతి వాక్యవిదితై రధ్యాత్మవిద్యా శివ-
బ్రహ్మాఖ్యై రతుల ప్రభావసహితై స్తత్త్వై స్త్రిభిః సద్గురోః।
త్వద్రూపస్య ముఖారవిన్ద వివరా త్సమ్ప్రాప్య దీక్షా మతో
యస్త్వాం విన్దతి తత్త్వత స్తదహ మిత్యార్యే స ముక్తో భవేత్ ॥ ౨౨

**ప్రతిపదార్థము:**-ఆర్యే-గౌరీమాతా!, సత్ చిత్ తత్ త్వమ్ అసి ఇతి-సత్తు చిత్తు తత్త్వమసి అను వాక్యములచే, విదితైః-తెలియబడినవియు, అతులప్రభావ-మహాప్రభావముతో, సహితైః-కూడినవియు, అధ్యాత్మవిద్యా శివ బ్రహ్మాఖ్యైః-అధ్యాత్మవిద్యా శివ బ్రహ్మ తత్త్వములు అను పేరుగలవియు అగు, త్రిభిః-మూడు విధములైన, తత్త్వైః-తత్త్వములచేత, త్వద్రూపస్య-నీ స్వరూపుడైన, సద్గురోః-సద్గురువు యొక్క, ముఖారవిన్ద-ముఖపద్మముయొక్క, వివరాత్-గుహ నుండి, దీక్షామ్-దీక్షను, సంప్రాప్య-పొంది, అతః-ఈ దీక్షవలన, యః-ఏ సాధకుడు, తదహమితి-ఆ బ్రహ్మయే నేను అని, లేదా, ఆ దేవియే నేనని, తత్త్వతః-యథార్థముగా, త్వామ్-నిన్ను, విన్దతి-అందుకొనునో, సః-వాడు, ముక్తః-మోక్షము పొందిన వాడు, భవేత్-కాగలడు.

**తాత్పర్యము:**-సత్ అనగా సత్యమైన శాశ్వతమైన 'బ్రహ్మ' పదార్థమే. చిత్= మాయా. నేను అను జ్ఞానమునుంచి అన్నిరకములైన జ్ఞానములకు మూలము. తత్ అనగా మాయను మించినది అతీతమైన విద్యాతత్త్వము. త్వమ్ అనగా నీవు అనగా నీవు శివుడవు అసి= అగుచున్నావు. అనగా సత్యమైన జ్ఞానస్వరూపమైన పరబ్రహ్మతత్త్వము నేనే అని తెలియుటయే. అధ్యాత్మవిద్యా శివబ్రహ్మ తత్త్వములు. ఇట్టి తత్త్వములు గురుబోధవలన తెలిసికొని, గురువునుండి పూర్ణాభిషేక పూర్వకముగా దీక్షపొంది, తత్త్వజ్ఞాన పురస్సరముగా 'నీవే, తాను' అని ఎఱిగిన వాడు ముక్తి పొందును.

**విశేషములు:-**

౧. సత్-బ్రహ్మ, చిత్-మాయ. ఇది ఆత్మతత్త్వము. ఇది స్థూలదేహశోధన చేయును. సత్యమైన'నేను' అనునది బ్రహ్మ. ఇతరము మాయ అని గ్రహించుట తో స్థూలదేహము నిరసింపబడును.

౨. తత్ అనగా మాయాతీతమైనది. దీని వలన విద్యాతత్త్వము తెలియుచున్నది. ఇది సూక్ష్మదేహశోధన చేయును. అనగా మనశ్శుద్ధి గలిగించును. మాయాతీత మైన జ్ఞానతత్త్వమును గూర్చిన ఆలోచన ఇది.

౩. త్వమ్- నీవు అనగా శివతత్త్వమునకు గుర్తు. తత్ అనబడు తత్త్వమే నీవు అన్నప్పుడు ఆ 'నీవు' శివుడే అని అర్థము. కనుక కారణదేహమందున్న 'నేను' అను ప్రజ్ఞను 'తత్ త్వమ్' అని మేల్కొల్పుట. కనుక ఇది కారణదేహశోధకము.

౪. అసి- అగుచున్నావు అనుటవలన సర్వజ్ఞత సర్వరూపత సిద్ధిస్తున్నది. సమస్త జగత్తునందు నిలచియున్న ఈశ్వరరూపమైన సమష్టిదేహములందుగల ఈశ్వరతత్వమును చెప్పినట్లు గనుక ఇది సమష్టిదేహశోధకము. దీనిని బ్రహ్మ తత్త్వము అన వచ్చును. ఇట్లు దేహచతుష్టయశుద్ధి చేయుటద్వారా సాధకునకు ముక్తి కలిగించునవి అధ్యాత్మవిద్యా శివ బ్రహ్మ తత్త్వములు.

౫. సద్గురువు అనగా సత్సంప్రదాయము గలవాడు. తత్త్వత్రయోపదేశము, మంత్రోపదేశము, పూర్ణాభిషేకము, పాదుకాంతదీక్ష, అనునవి శ్రీచక్ర, శ్రీవిద్యా సంప్రదాయములందు 3 రోజులపాటు జరిపే ప్రక్రియ. అట్టివాడు సర్వమంత్రాధికారి కాగలడు.

**౬. పూర్ణాభిషేక విధానము**

యోగులకు యోగమహిమతో అమృతాభిషేకము జరుగును. అందుకు ప్రతీకగా ఉపాసనాకాండలో గూడ పాదుకాంతదీక్షాపరులకు అభిషేకము జరుగును. పైగా ఇది మంత్రసామ్రాజ్య పట్టాభిషేకము. అభిషేకము పొందిన వానికి గురూపదేశములేకయే సకల మంత్రాధికారము సిద్ధించును అని సంప్రదాయము. ముందు యోగులకు జరుగు అమృతాభిషేకముగూర్చి

ముచ్చటించుకొందము.

''ఉత్తిష్ఠత మాస్వప్త అగ్నిమిచ్ఛధ్వం భారతాః।
రాజ్ఞః సోమస్య తృప్తాసః సూర్యేణ సయుజోషసః॥''

- అరుణోపనిషత్

ఈ మంత్రమునకు అర్థము సౌభాగ్యభాస్కరమునందు ఇట్లు వివరింపబడినది.

''అగ్నికుండలినీ ముత్థాప్య సూర్యకుండలిన్యా సంయోజ్యతాభ్యాం చంద్రమండలం శివశక్తి సామరస్యేన ద్రావయిత్వా తదుత్థామృతధారాభిః ద్విసప్తతి సహస్రనాడీమార్గానాపూర్య తృప్తా భవత'' ఇత్యర్థః। అనగా

'మూలాధారమందలి అగ్నికుండలిని యోగసాధనతో ఊర్ధ్వముఖము గావించి సహస్రారమందలి సూర్యకుండలినితో కలిపినచో ఆ వేడికి సహస్రారము నందలి చంద్రమండలము స్రవించును. అదే అమృతధారగా శరరమునందలి భౌతిక అభౌతిక నాడీమండలమును ఆహ్లాదనము చేయును.'

ఈ వ్యాఖ్యకు సమర్థనగా 'శుకసంహిత' లోని శ్లోకము చూడదగును.

'పావకస్యార్చిషా భానోః జ్యోతిషా మహసా విధోః
దోహమానా సుధాధారా ద్విసప్తతి సహస్రధా
గుప్తాచారా కుండలినీ తృప్తా నస్మాన్ తనోతు సా'

దీనికే గౌడపాదాచార్యుల 'సుభగోదయస్తుతి' లోని శ్లోకము వివరణముగా కలదు.

'యదా తౌ చన్ద్రార్కౌ నిజసదన సంరోధన వశాత్
అశక్తౌపీయూష స్రవణ హరణే సా చ భుజగీ।
ప్రబుద్ధా క్షుత్క్రుద్ధా దశతి శశినం బైన్దవగతమ్
సుధాధారా సారైః స్నపయతి తనుం బైన్దవకలే॥'

ఈ అమృతస్రావము జరిగిన నాడే మన స్మార్త శ్రౌతకర్మలైనను ఫలింపగలవు. లేనిచో వ్యర్థములేనని 'సౌభాగ్యభాస్కరము'న భాసురానందనాథుని యభిప్రాయము. చూ॥

'కుండలిన్యుత్థాపనేన మధుస్రావణేన, డాకిన్యాది మండలాప్లావన రూపాంతర కర్మణి సత్యేవ, బాహ్యాని యజ్ఞాది కర్మాణి సఫలాని భవన్తి'

కాని అందఱకును ఇది సాధ్యము కాదుగదా! అందువలన, భాసురానంద నాథుడే ఒక పద్ధతి చెప్పినాడు. చూ॥

'అయోగిభిరపి భావనా మాత్రేణ ఏషా సంపాద్యా'

అనగా, అమృతస్రావము జరిగినట్లు సామాన్యసాధకుడు సైతము భావింపవలెను. అందువలన ఉపాసనలో ఫలితములు జరుగును. పూజ, మంత్రము మొదలగు అన్నియు సంకేతభావనలమీద ఆధారపడినవే గదా! మనస్సు మననము దేనికయినను ఆధారమే కదా.

ఈ అమృతస్రావమునకు సమానముగా పాదుకాంతదీక్ష చేయువారు పూర్ణాభిషేకము జరుపుకొందురు. క్లుప్తముగా ఆ ముచ్చట చూచెదము.

**పూర్ణాభిషేక విధానము:-** ఇది మూడు దినముల కార్యక్రమము. అందు

౧. ప్రథమ దినము- అధివాసదినము. గురుని ఆధ్వర్యమున శిష్యునకు మంగళ స్నానము, పాపపురుష దహనము, పుణ్యపురుషస్థాపనము, శరీరత్రయ శోధనము, షట్చక్ర ధ్యానము, అంతర్మాతృకాన్యాసము, అఖండ దీపారాధన, దేవీ షోడశ ఉపచారపూజ, పంచగవ్య ప్రాశన మొదలగునవి జరుగును.

౨. ద్వితీయ దినమున ప్రధానముగా పంచామ్నాయముల ఉపదేశము జరుగును. గురువు శిష్యునకు 1. పూర్వామ్నాయములు

2. దక్షిణామ్నాయములు

3. పశ్చిమామ్నాయములు

4. ఉత్తరామ్నాయములు

5. ఊర్ధ్వామ్నాయములను ఉపదేశించి దీక్ష ఇచ్చును. 5 దీక్షలకు 5 అభిషేకములు చేయవలెను. తరువాత గురుపరంపరోపదేశము, ప్రాతస్సంధ్య, బీజసంధ్య చేయబడును.

3. తృతీయదినమున, గురువు శిష్యునకు కలశారాధనము, శ్రీచక్రపూజ,

మూలమంత్రహోమము, పంచామ్నాయహోమము, న్యాసములు, అంజనము, సర్వమంత్రాధికార సామ్రాజ్యసిద్ధికోసము పూర్ణాభిషేకక్రియ, అందులో భాగముగా, షోడశాక్షరీ ఉపదేశము, పాదుకామంత్రోపదేశము, దీక్షా నామ కరణము, తరువాత కామేశ్వరీ కామేశ్వర మంత్రములతో పూర్ణాభిషేకము జరుగును.

అవతారిక:-న్యాసము దీక్షలు మొదలగు అనేక ప్రక్రియలతో కష్టమైన శ్రీవిద్యకు ఏల ఇంత ఆదరము. ఇంత ప్రయాసలేని యితర విద్యలు గలవు గదా. అను ప్రశ్నకు సమాధానము ఇందు చెప్పుచున్నాడు.

శ్లో॥ సిద్ధాన్తై ర్బహుభిః ప్రమాణగణితై రన్యై రవిద్యాతమో
నక్షత్రైరివ సర్వమన్ధతమసం తావన్న నిర్భిద్యతే ।
యావత్తే సవితేవ సమ్మతమిదం నోదేతి విశ్వాన్తరే
జన్తో ర్జన్మనివారణైకభిదురం శ్రీశామ్భవి శ్రీశివే ॥ ౨౩

**ప్రతిపదార్థము:**-శ్రీశామ్భవి- ఓ శాంభవీవిద్యా స్వరూపురాలా!, శ్రీశివే - ఓ సదాశివశక్తీ!, జన్తోః-జీవియొక్క, జన్మనివారణ-జన్మ హరణములో, ఏకభిదురమ్- ఏకైక సమర్థమైనదియు, తే- నీకు, సంమతమ్- ఇష్టమైనదియు అగు, ఇదమ్-ఈ విద్య, విశ్వాంతరే- ప్రపంచమునందు, సవితేవ-సూర్యునివలె, యావత్-ఎంతలో, నోదేతి-ఉదయింపలేదో, తావత్-అంతవఱకు, నక్షత్రైః- నక్షత్రములచేత, సర్వమ్-సమస్తమైన, అంధతమసమివ-చీకటివలె, ప్రమాణ గణితైః- అనుమానాది ప్రమాణములచే సాధింపబడిన, అన్యైః-ఇతరములైన, బహుభిః- అనేకములైన, సిద్ధాన్తైః-స్వల్పసిద్ధాంతములచేత, అవిద్యాతమః- అజ్ఞానాంధకారము, న నిర్భిద్యతే-భేదింపబడదు.

**తాత్పర్యము:**- ఓ పరమ కల్యాణశక్తీ!, శాంభవీవిద్యా!, ఇంతకు ముందుగల అల్పతంత్రములు అనేకములు. అవి నక్షత్రముల వంటివి. నక్షత్రములు సూర్యునివలె చీకటిని చెండాడగలవా? అట్లే ఘోరమైన అజ్ఞానాంధకారమును నక్షత్రములవంటి ఆ స్వల్పవిద్యలు ఎట్లు పోగొట్టగలవు? సూర్యునివంటి శక్తిమంతమైన నీ పరావిద్య యుదయించిన తరువాత అజ్ఞానాంధకారము పటా

పంచలైనది. కనుక ఇంక ఆ స్వల్పతంత్రవము లేల? కనుక పరావిద్యనే ఆశ్రయించెదను.

**విశేషములు:-**

శ్రీవిద్యోపాసన సమగ్రమని, ఏతన్మార్గము సర్వ అజ్ఞాననిరోధకమై ముక్తిని జీవన్ముక్తిని కల్గించునని తెలియజేయబడినది.

**అవతారిక:-** అవిద్యను నశింపజేయుటకు ఆత్మానుసంధానము గలదు. **తత్త్వమసి** మొదలగు వాక్యములు గలవు. ఆత్మశ్రవణ మనన ధ్యాన సాక్షాత్కారణములు జ్ఞాన హేతువులు, అజ్ఞాననాశకములు అని ఉపనిషత్తులు చెప్పుచున్నవి. అట్టి యెడ క్రొత్తగా ఈ 'శ్రీవిద్య' ఏల? అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

శ్లో॥ ఆత్మాసౌ సకలేన్ద్రియాశ్రయ మనోబుద్ధ్యాదిభిః శోచితః
కర్మాబద్ధతను ర్జనిం చ మరణం ప్రాప్నోతి యత్కారణమ్।
తత్తే దేవి మహావిలాసలహరీ దివ్యాయుధానాం జయ
స్తస్మా త్త్వాం గురు మభ్యుపేత్య కలయే త్త్వా మేవ చే న్ముచ్యతే ॥ ౨౪

**ప్రతిపదార్థము:-** దేవి- ఓ దేవీ, యత్కారణమ్- ఏది కారణముగా, అసౌ- ఈ, ఆత్మా- ఆత్మ, సకలేన్ద్రియ- కర్మేంద్రియ జ్ఞానేంద్రియముల యొక్క, ఆశ్రయ- ఆశ్రయమైన, మనోబుద్ధ్యాదిభిః- మనస్సు బుద్ధి మొ॥ వానిచే, శోచితః- బాధింపబడిన వాడై, కర్మ- పుణ్య పాపకర్మలచే, ఆబద్ధ- బంధింపబడిన, తనుః- శరీరము కలవాడై, జనిమ్- జన్మను, మరణం చ- మరణమునున్ను, ప్రాప్నోతి- పొందుచున్నదో, తత్- ఆ కారణము, తే- నీ, మహావిలాస- సృష్టిరూప మహావిలాసము యొక్క, లహరీ- ప్రవాహరూపములైన, దివ్యాయుధానామ్- పాశాంకుశ ధనుర్బాణాది ఆయుధముల యొక్క, అనగా కామక్రోధాదుల యొక్క, జయః- ప్రతాపమే, తస్మాత్- కనుక, త్వామ్- నిన్ను, గురుమ్- గురువుగా, అభ్యుపేత్య- పొంది, త్వామేవ- నిన్నే, కలయేత్ చేత్- ఆరాధించినచో, ముచ్యతే- ముక్తి పొందగలడు.

**తాత్పర్యము:-** అమ్మా!, వేదాంతములు చెప్పిన జ్ఞాన సాధన మంచిదే. కాని,

అది ఎట్లు సాధ్యము? ఆత్మజ్ఞానము పొందవలెను. అనగా 'ఆత్మ'ను తెలిసికొనవలెను. కాని ఏమి ప్రయోజనము? ఆ'ఆత్మ' నీ సృష్టి మాయా విభ్రమములైన ఆవరణ విక్షేపశక్తి విలాసములైన ఇంద్రియమనోబుద్ధుల మధ్య బందీ అయి నానా దుఃఖములు అనుభవించుచు రకరకాల దేహములద్వారా జనన మరణ యంత్రమున నలుగుచున్నాడు. అట్టి 'ఆత్మ'ను దెలిసికొనుట కన్న నిన్ను ధ్యానించుటయే ముక్తిదాయకము. సృష్టిని నడిపించుటకు కావలసిన మనస్సును చెఱుకువిల్లుగాను; క్రోధమును అంకుశముగాను; పంచతన్మాత్రలను బాణములుగాను; రాగమును పాశముగాను; ధరించిన నిన్ను సేవించినచో వాటిని జయించుట సాధ్యమగును. కనుక, 'ఆత్మ' జిజ్ఞాసకన్న నీ సేవ మిన్న అని శ్రీవిద్యనే ఆశ్రయించెదము.

**విశేషములు:-**

౧.'రాగస్వరూపపాశాఢ్యా క్రోధాకారాంకుశోజ్జ్వలా
మనోరూపేక్షుకోదండా పంచతన్మాత్రసాయకా' - లలితాసహస్రనామము.

౨.మాయాశక్తి అయిన దేవి ప్రాభవమునకు 'ఆత్మ' యే అజ్ఞానమునబడి జనన మరణములను పొందుచుండగా ఆ'ఆత్మ'ను ధ్యానించి మనము ఏమి పొందగలము? తనకే దిక్కులేని ఆత్మ మనకు ఏమి దిక్కు కాగలదు. కనుక ఆత్మను గూడా ఆడించగల నిన్ను నమ్ముకొన్నచో, నిన్నే గురువుగా స్వీకరించినచో, నీ ఆయుధములను ఉపసంహరించెదవు. భక్తులను బాధింపవు గదా! బిడ్డలను బాధింపవు గదా. శిష్యులను వంచింపవు గదా. కనుక నిన్నుసేవించుట వలన మోక్షము సులభ సాధ్యము అగును.

3.వేదాంతదర్శన ప్రోక్తమైన 'ఆత్మ' ధ్యానముకన్న శ్రీదేవీ సేవనమే లఘూపాయము, సమ్యగుపాయము అని చెప్పబడినది.

౪.సర్వమానవబుద్ధులు దేవతాధీనములు. వారే అంతఃకరణ బహిఃకరణాధిపతులు. కనుక వారు దలచినచో మనచేత తప్పు చేయించగలరు. ఒప్పు చేయించగలరు. కనుకనే గ్రంథములందు, వేదమునందు భగవంతుని కరుణవలన మాత్రమే

జిజ్ఞాస ముక్తి కలుగునని చెప్పబడినది. చూ॥

'ఈశ్వరానుగ్రహో దేవపుంసా మద్వైతవాసనా' అట్లే

'యమే వైష వృణుతే తేన లభ్యః' - శ్రుతి.

'జ్ఞానినామపి చేతాంసి దేవీ భగవతీ హి సా,

బలాదాకృష్య మోహాయ మహామాయా ప్రయచ్ఛతి' - మార్కండేయపురాణం

అనగా, మానవులలో మోక్షవాంఛ ఈశ్వరానుగ్రహము వలననే కలుగునని, తను కోరిన వానికే భగవంతుడు లభించుననియు, ఎంతటి జ్ఞానులనైనను, మాయా శక్తి బలవంతముగా ఆకర్షించి మోహమున బడవేయుననియు అర్థము. ఇంకా,

'ఏషహ్యేవైనం సాధుకర్మకారయతి తం యమ
న్వానునేషత్యేష ఏవైన మసాధుకర్మకారయతి
తం యమేభ్యోలోకేభ్యోనునుత్సతే ఏష లోక
పాల ఏష లోకాధిపతి రేష సర్వేశ్వరః' - కౌషీతక బ్రాహ్మణం. 3 - అధ్యా.

కనుక, దేవి నాశ్రయించుటయే క్షేమకరమైన యుపాసన అని కవి భావము.

**అవతారిక:** - సంసార సముద్రమున మునిగితేలుచున్న మనవంటి సామాన్యుల సముద్ధరణకై దుర్వాసమహాముని దేవిని ప్రార్థించుచున్నాడు.

శ్లో॥ నానాయోని సహస్రసమ్భవ వశా జ్జాతా జనన్యః కతి
ప్రఖ్యాతా జనకాః కియన్త ఇతి మే సేత్స్యన్తి చాగ్రే కతి ।
ఏతేషాం గణనైవ నాస్తి మహతః సంసారసిన్ధో ర్విధే
ర్భీతం మాం నితరా మనన్య శరణం రక్షానుకమ్పానిధే ॥ 21॥

**ప్రతిపదార్థము:** - అనుకమ్పానిధే- ఓ దయానిధీ!, మే-నాకు, నానాయోని సహస్ర- అనేక జన్మ సహస్రములందు, సంభవ వశాత్- పుట్టిన కారణమున, జనన్యః-తల్లులు, కతి-ఎందఱు, జాతాః-పుట్టిరి, ప్రఖ్యాతాః- ప్రసిద్ధులైన, జనకాః-తండ్రులు, కియన్తః-ఎంతటి వారు, ఇతి-ఈ విధముగా, మే-నాకు, అగ్రే-ముందు, కతి-ఎందఱు, సేత్స్యన్తి-సిద్ధింపగలరు, ఏతేషామ్-ఈ తల్లి దండ్రులకు, గణనైవ- లెక్కయే, నాస్తి-లేదు, మహతః-గొప్పదైన, సంసారసిన్ధోః-

సంసారసముద్రము యొక్క, విధేః-విధానము నుండి, భీతమ్-భయపడిన వాడను, నితరామ్-మిక్కిలి, అనన్య శరణమ్-వేఱు దిక్కులేని వాడను అయిన, మామ్-నన్ను, రక్ష-రక్షింపుము.

**తాత్పర్యము:**-తల్లీ! చరాచరచక్రమును అనంత జనన మరణ పరంపరలతో ఆడించుదానవు. ఒక జీవునిగా నేను ఎన్ని జన్మలు ఎత్తితినో, జన్మజన్మకు ఎందఱు తల్లులు ఎటువంటి తండ్రులుగలరో! ఇట్లే ఇకముందు- నీవు ఇంకను దయదలచనిచో-ఎంతమంది తల్లిదండ్రులు గలుగుదురో? తల్లీ! అతిభయంకర మైన యీ సంసారచక్ర విధానమునుండి నన్ను రక్షింపుము. అందున నీవు తప్ప వేఱు దిక్కులేనివాడను! కేవలము దయతో నన్ను ఉద్ధరింపుము.

**విశేషములు:**-

౧.'24'శ్లోకమునుబట్టి యీ ప్రపంచమున సర్వవిపత్తులు దేవి ఆయుధముల నుంచి జరుగును. 'ఆత్మ'గూడా వానికి బందీయే. కనుక ఆమె దయవలన మాత్రమే దీని నుంచి బయటపడగలము అని భావము.

౨.'అనన్య శరణం' అనుటకు కారణము '23'శ్లోకములో చెప్పినట్లు వేదాన్త దర్శనము మొదలగు ఇతర తంత్రములను వదలి సూర్యునివంటి 'దేవీ' తంత్రమునే స్వీకరించెను. కనుక 'అనన్య శరణం' అని చెప్పికొనెను.

**అవతారిక:**-సంసారదుఃఖనివారణ కొఱకు ఆత్మజ్ఞానము కాక యజ్ఞయాగాది క్రియలు గలవు. కాని వాటిని ఆచరించుటకన్న ఈ శ్రీవిద్యారాధనలోగల విశేషము చెప్పుచున్నాడు.

శ్లో॥ దేహక్షోభకరై ర్వ్రతై ర్బహువిధై ర్దానై శ్చ హోమై ర్జపైః
సన్తానై ర్హయమేధముఖ్య సుమఖై ర్నానావిధైః కర్మభిః।
యత్సఙ్కల్ప వికల్ప భావ మలినం ఖ్యాతం పదం తస్య తే
దూరాదేవ నివర్తతే పరతరం మాతః పదం నిర్మలమ్ ॥ ౨౬

**ప్రతిపదార్థము:**-మాతః-తల్లీ!, దేహక్షోభకరైః-శరీరక్షోభ కల్గించునవియగు, వ్రతైః-వ్రతములచేత, బహువిధైః-అనేక విధములైన, దానైః-దానములచేత,

హోమైః-హోమములచేత, జపైః-జపములచేత, సన్తానైః-సప్త సంతానములైన తటాక ఆలయ కావ్యాది నిర్మాణములచేత, హయమేధముఖ్య-అశ్వమేధము మొదలగు, సుమఖైః-మంచి యజ్ఞములచేత, నానావిధైః-పలురకములైన, కర్మభిః -క్రియలచేత, సంకల్ప వికల్ప-చేసెదను చేయను వంటి, భావ-భావములచేత, మలినమ్-కల్మషమైన, యత్-ఏ, పదమ్-నీ స్థానము, ఖ్యాతమ్-చెప్పబడినదో, తస్య-ఆ స్థానమునకు, నిర్మలమ్-నిర్మలమైనదియు, పరతరమ్-అత్యంతశ్రేష్ఠ మైనదియు అగు, పదమ్-స్థానము, దూరాదేవ-దూరము నుంచియే, నివర్తతే-మఱలును.

**తాత్పర్యము:**-అనేక రకాల వ్రతములు గలవు. వాటి నిర్వహణలో శరీరశ్రమ ఎక్కువ. బహువిధానములు గలవు. అవి ద్రవ్యమున్ననే సాధ్యములు. కుటుంబ సభ్యుల ఆక్షేపణలు ఉండును. హోమజపములున్నూ కష్టసాధ్యములే. సప్త సంతానములు ద్రవ్యసాధ్యములే. అశ్వమేధాదియజ్ఞములు ప్రతాపసాధ్యములు. ఇతర కర్మలు బలహీనములు. పైగా వీటివలన వచ్చు పుణ్యలోకములు సుఖములు స్వల్పకాలికములు. వీనియందు 'అవును-కాదు' అనే సందిగ్ధత లుండును. ఇట్టి దోషములేవియు లేని నీ నిర్మలస్థానమునకు ఇవి ఎంతో దూరము.

**విశేషములు:**-

౧. ఇది దుర్గాస్తుతి, చేయువాడు దుర్గాభక్తుడు. కనుక శ్రీవిద్యోపాసనే పరమ కర్తవ్యముగా చెప్పుట సహజమే. ఇంతమాత్రముచేత ఇతర తంత్రములు పనికిరావని మనము భావింపరాదు. ఎవరి పెళ్లిలో వాడు గొప్ప. అట్లే విష్ణు పురాణములో విష్ణువు గొప్ప. శివపురాణములో శివుడు గొప్ప. దేవీభాగవతంలో 'దేవి'గొప్ప. గణపతిపురాణములో గణపతి గొప్ప. అంతే. లేనిచో పంచాక్షరీ మొదలగు ఉపాసనలు అల్పమహిమగలవని చెప్పవలసి వచ్చును.

౨. వీని అర్థమేమనగా, 'ఒక్కడే దేవుడు', ఆయనను మనము అనేక విధముల దర్శించుచున్నాము. '20' శ్లోకమున చెప్పినట్లు ఇచట ఆలోచించినచో,

శివతంత్రమున 'శివుడు'గా; విష్ణుతంత్రమున 'విష్ణువు'గా

జైనతంత్రమున 'జినుడు'గా

ఇంకను ఇలా చెప్పబడిన దేవుడు ఎవడైనను 'పరమదైవతమే' కనుక 'ఆ పరమ దైవతము, ఆ తంత్రము'గొప్ప అని చెప్పుట అబద్ధము కానేరదు. కనుక చెప్పవచ్చును.

'నృణామేకో గమ్యః త్వమసి పయసామర్ణవ ఇవ' - మహిమ్న స్తోత్రము.

3. మొత్తము తంత్రములమీద చూడగా శ్రీవిద్యాతంత్రమునకు ప్రాధాన్యము అనుభవసిద్ధమే.

**అవతారిక:** - సకలమాతృకలకు మూలమైన 'అకార హకార' రూప పరాశక్తిని స్తుతించుచున్నాడు.

శ్లో॥ పఞ్చాశ న్నిజదేహజాక్షరభవై ర్నానావిధై ర్ధాతుభి
ర్బహ్వర్థైః పదవాక్యమాన జనకై రర్థావినా భావితైః।
సాభిప్రాయవదర్థ కర్మఫలదైః ఖ్యాతై రనన్తై రిదమ్
విశ్వం వ్యాప్య చిదాత్మనాహమహ మిత్యుజ్జృమ్భసే మాతృకే॥ ౨౭

**ప్రతిపదార్థము:** - మాతృకే- అక్షరమాలికా స్వరూపురాలా!, పఞ్చాశత్- ఏబది యైన, నిజ- తన, దేహజ- శరీరమునందు బుట్టిన, అక్షర- అక్షరములనుండి, భవైః- పుట్టినవియు, బహ్వర్థైః- అనేకార్థములు గలవియు, పద- పదముల యొక్క, వాక్య- వాక్యముల యొక్క, మాన- ప్రమాణములైన ఛందస్సులకు, వ్యాకరణాది శాస్త్రములకు, జనకైః- కారణములైనవియు, అర్థావినా భావితైః- అర్థయుక్తములైనవియు, సాభిప్రాయవత్- అభిప్రాయముతో గూడిన, అర్థ- అర్థములైన వస్తువుల వ్యక్తుల, కర్మ- పనులకు, ఫలదైః- ఫలములను ఇచ్చునవియు, ఖ్యాతైః- ప్రసిద్ధములైనవియు, అనంతైః- అంతులేనివియు అగు, ధాతుభిః- ధాతువులచే, ఇదమ్- ఈ, విశ్వమ్- ప్రపంచమును, వ్యాప్య- వ్యాపించి, చిదాత్మనా - చైతన్య రూపముతో, అహమహమితి- నేను నేను అని, ఉజ్జృమ్భసే- విజృంభించుచున్నావు.

**తాత్పర్యము:** - శరీరమునందలి సప్తధాతువులతో శరీరమునందలి పనులన్నియు

సాగును. అట్లే, వర్ణమాతృకా పరావాక్ స్వరూపమైన దేవి శరీరమునందు ధాతువులు( రూట్స్) గలవు. శరీరమునందలి 50 అక్షరములనుండి అవి పుట్టినవి. వాటికి అనేక అర్థములు గలవు. ధాతువులనుండి, పదములు, వాక్యములు; వాని నుండి ఛందోవ్యాకరణాదులు ఏర్పడును. ఈ పదముల వలన వస్తునామములు,గుణ నామములు, క్రియలు మొదలగునవి పుట్టును. ఇట్లు తయారైన శబ్దప్రపంచము గూడా ఒక శరీరము వంటిది. దీనియందు దేవి చైతన్యరూపమై 'అహమహం' అని విజృంభించుచున్నది.

**విశేషములు:-**

౧. ధాతువులచే పరిపోషితమైన శరీరమునందు చైతన్యము అనగా ప్రాణశక్తి 'నేను నేను' అని కనబడును.

౨. ధాతువులచే పరిపోషితమైన యీ శబ్దప్రపంచమునందు మాతృకారూపమైన నాదమయి వాగ్దేవి 'అహం అహం' అని సంచరించును. అహం అనగా 'అ'కారమునుంచి 'హం'వఱకు 50 అక్షరాలు అని అర్థము. అనగా ఏ ధాతువు, ఏ శబ్దము తీసికొన్నను అందులోని అక్షరములు 'అ'నుంచి 'హం'లోపలివి అని అర్థము. కనుక వానిలో 'అహం'రూపముతో దేవి సంచరించును అని అర్థము.

3. భూమి మొదలగు ధాతువులచే ఏర్పడిన ఈ ప్రపంచమునందు సర్వత్ర చైతన్యము 'నేను నేను' అని తననే ఉదహరించుచు,సంచరించుట. 'చిచ్ఛక్తి' అనగా చైతన్యవిలాసమే.

**అవతారిక:**-సిద్ధమైన 'శ్రీచక్ర'మును దేవతా సమేతముగా స్తుతించు చున్నాడు.

శ్లో॥ శ్రీచక్రం శ్రుతిమూలకోశ ఇతి తే సంసారచక్రాత్మకం
విఖ్యాతం తదధిష్ఠితాక్షర శివజ్యోతిర్మయం సర్వతః।
ఏత న్మన్త్రమయాత్మికాభి రరుణం శ్రీసున్దరీభి ర్వృతమ్
మధ్యే బైన్దవసింహపీఠలలితే త్వం బ్రహ్మవిద్యా శివే॥ ౨౮

**ప్రతిపదార్థము:**- హే శివే- ఓ కల్యాణీ, తే- నీ యొక్క, శ్రీచక్రమ్- శ్రీచక్రము,

శ్రుతిమూల-వేదమూలమైన ప్రణవము యొక్క, కోశః-నిలయమైనది, ఇతి-అను కారణమువలన, సంసారచక్ర-ప్రపంచచక్రమే, ఆత్మకమ్-స్వరూపముగా గలదిగా, విఖ్యాతమ్-ప్రసిద్ధమైనది, తత్-ఆ, చక్రము, సర్వతః-అన్నివైపుల, అధిష్ఠిత-అధిష్ఠించిన, అక్షర-బీజాక్షరమైన, శివ-శివశక్తులనే, జ్యోతిర్మయమ్-కాంతులతో నిండినది, ఏతత్-ఈ శ్రీచక్రము, మంత్రమయాత్మికాభిః-'ల' కారాది మంత్రములనుండి జనించిన, శ్రీసున్దరీభిః-శక్తిసుందరీమణులచే, వృతమ్-పరివేష్టింపబడినదై, అరుణమ్-ఎఱ్ఱనైనది, బైన్దవ-బిందుచక్రమందలి, సింహపీఠ-సింహాసనముచేత, లలితే-మనోహరమైన, మధ్యే-త్రికోణమధ్యమున, త్వమ్-నీవు, బ్రహ్మవిద్యా-పరబ్రహ్మస్వరూపమైన విద్యాశక్తివి.

**తాత్పర్యము:**-దేవీ! నీ చక్రము వేదమునకు మూలమైన ఓంకారమునకు ప్రధాన నివాసము. ఇది సంసారచక్రరూపము. అనగా ప్రపంచస్వరూపము. ప్రపంచము '2' విధములు. కాలస్వరూపము, దేవీస్వరూపము. ఈ'2'స్వరూపములుగల ప్రపంచచక్రమే శ్రీచక్రము. దాని ఆవరణములందు అణిమాదిసిద్ధులు, కామాకర్షిణి మొ॥శక్తులు, ఇంకను అనేకమైన జ్యోతిర్మయశక్తులు గలవు. మఱియును మంత్రమయమైన దుర్గా, బాలా మొ॥శ్రీశక్తులు గలవు. అరుణ వర్ణమైన ఈ శ్రీచక్రమున త్రికోణమధ్యమున 'బిందు' రూప సింహాసనమున ఆసీనురాలైన 'బ్రహ్మవిద్యవు' నీవే.

**విశేషములు:**-

౧. ఓంకారప్రభవములు వేదములు. ఈ ఓంకారము శ్రీచక్రమున మధ్యమున బిందుత్రికోణరూపముగా గలదు. కనుక ఓంకారము శ్రుతిమూలము. కనుక దానికి కోశము 'శ్రీచక్రము'. కనుక శ్రీచక్రము శ్రుతిమూలకోశము అని అర్థము.

౨కోశము అనునది శ్రీచక్రమందలి త్రికోణము. దానియందలి త్రికోణములు కామకలాగతమైన '3' బిందువులు. కామకలాక్షరము ఓంకారతుల్యమని ఇంతకుముందు చెప్పబడినది. ఈ'3'బిందువులు బ్రహ్మ విష్ణు రుద్ర బిన్దువులు.

బ్రహ్మబిందువును 'వామాశక్తి' అందురు.

'బ్రహ్మబిన్దు ర్మహేశాని వామాశక్తి రుదీరితా' - జ్ఞానార్ణవము ఓంకారమునందు అకారము బ్రహ్మబిందువు. బ్రహ్మ సృష్టిస్వరూపుడు. వామా అనగా సృష్టిని కక్కునది అని యర్థము. వమతి- కక్కును కనుక 'వామా'.

3. సంసారచక్రము అనగా ప్రపంచచక్రము. ప్రపంచము కాలమని, దేశమని '2' విధములు. శ్రీచక్రమునకు కాలచక్రముతో దేశచక్రముతోనూ సామ్యము శ్రీశివ ప్రతిపాదితమైన తంత్రరాజమున చెప్పబడినది.

3.(1). పంచప్రేతాసనాసీనా

పంచప్రేతలు అనగా ఐదుగురు మృతజీవులు. ఇచట సుషుమ్నా నాడి యందు క్రిందనుంచి బ్రహ్మ విష్ణు రుద్ర ఈశ్వర సదాశివులు గలరు. వీరు సృష్టిక్రమమున సదాశివ ఈశ్వర రుద్ర విష్ణు బ్రహ్మలుగా చెప్పబడెదరు. సృష్టి క్రమమున కుండలినీశక్తి వీరిని తేజోవంతులను శక్తివంతులను చేయుచు క్రింది కి దిగివచ్చి 'బ్రహ్మ' గ్రంథివద్ద స్వయంభూలింగమును పరివేష్టించి నిద్రించును. కనుక, పై దేవతలు 5గురు శక్తిమంతులు. కనుక 'పంచబ్రహ్మలు' అనెదరు. ఇది సృష్టిక్రమము. ఇక సంహారక్రమమున బ్రహ్మనుంచి బయలుదేఱిన కుండలినీశక్తి తనను ఆయా చక్రములనుండి ఉపసంహరించుకొనుచు పరతత్వమునందు లయించును. కనుక శక్తి విహీనులైన యీ శివులందఱు 'ప్రేతలు' అందురు. కనుక సంహారక్రమమున వీరు పంచప్రేతలు. శక్తియుక్తు డైనచో 'శివుడు', శక్తిత్యక్తుడైనచో 'శవుడు'.

దేవి ఒకక్రమమున 'పంచబ్రహ్మాసనాసీన'; మఱొకక్రమమున 'పంచప్రేతాసనాసీన' అగును. అట్లే యోగము 2 విధములు. సృష్టిక్రమము-సంహారక్రమము. సృష్టిక్రమమున దేవి 'పంచబ్రహ్మసుస్థిత'; సంహారక్రమమున దేవి 'పంచప్రేతాస నాసీన' అను రూపములతో చెప్పబడినది. '**శివశ్శక్త్యాయుక్తో యది భవతి శక్తః ప్రభవితుం**' అను ఆచార్య వచనము ఇచ్చట స్మరణీయము.

౪. మూలవిద్య అయిన పంచదశియందు పునరుక్తముకాని 9 అక్షరములనుండి

కాలచక్రము, దేశచక్రము, శ్రీచక్రము బయలుదేఱినవని జ్ఞానార్ణవమునందు గలదు.

'లకారా త్పృథివీ జాతా సశైలవనకాననా।
పంచాశత్పీఠసంపన్నా సర్వతీర్థమయీ పరా॥
సర్వగంగామయీ సర్వక్షేత్రస్థానమయీ శివే।
సకారా చ్చంద్రతారాది గ్రహరాశిస్వరూపిణీ॥
హకారాత్ శివసంబాధ వ్యోమమండల సంస్థితా।
ఈకారా ద్విశ్వకర్త్రీయం మాయా తుర్యాత్మికా ప్రియే॥
ఏకారా ద్వైష్ణవీ శక్తిః విశ్వపాలన తత్పరా।
రకారాత్ తేజసాయుక్తా పరంజ్యోతిః స్వరూపిణీ॥
కకారాత్ కామదా కామరూపిణీ స్ఫురదవ్యయా।
అర్ధచంద్రేణ దేవేశి విశ్వయోని రితీరితా।
బిందునా శివరూపేణ శూన్యరూపేణ సాక్షిణీ॥

భావము- 1.'ల'కారమునుండి 'భూమి' పుట్టినది.

2.'స'కారమునుండి 'చంద్రనక్షత్రాదిగ్రహములు' పుట్టినవి.

3.'హ'కారమునుండి 'ఆకాశమండలము' పుట్టినది.

4.'ఈ'కారమునుండి విశ్వకారణమైన 'మాయ' పుట్టినది.

5.'ఏ'కారమునుండి 'విష్ణుశక్తి' పుట్టినది.

6.'ర'కారమునుండి తేజోవతియైన 'పరంజ్యోతి' పుట్టినది.

7.'క'కారమునుండి 'కామరూపిణి' పుట్టినది.

8.'అర్ధచంద్రము' నుండి 'విశ్వయోని' అవతరించినది.

9.'బిందువు' నుండి శివరూపముతో 'సాక్షిణి' ఆవిర్భవించినది.

ఈ విధముగా మూలవిద్యనుండి శ్రీచక్రము, సంసారచక్రమున్ను పుట్టినవి. కనుక వాటి మధ్య సామ్యము.

౫. శ్రీచక్రమునందు ఆవరణ దేవతలు గలరు. ఒక్కొక్క దేవతకు ఒక్కొక్క

బీజము గలదు. అవి శివశక్తులు. ఈ ఆవరణములందు అణిమాదిసిద్ధులు గలవు. కామాకర్షిణ్యాదిశక్తులు, అనంగకుసుమాదిశక్తులు, సర్వసంక్షోభిణ్యాది శక్తులు, సర్వసిద్ధిప్రదాదిశక్తులు, సర్వజ్ఞాదిశక్తులు, వశిన్యాదిశక్తులు, కామేశ్వర్యాదిశక్తులు ఆయా ఆవరణములందు గలరు.

౬. ఈ బీజములనుంచి ఈ దేవతల ప్రభావముగా శ్రీచక్రమునందు ఆవరణములు ఏర్పడినవి.

1. లకారమునుండి 'చతురస్రము'
2. సకారమునుండి 'షోడశదలము'
3. హకారమునుండి 'అష్టదలము'
4. ఈకారమునుండి 'చతుర్దశారము'
5. ఏకారమునుండి 'బహిర్దశారము'
6. రకారమునుండి 'అంతర్దశారము'
7. కకారమునుండి 'అష్టకోణము'
8. అర్ధచంద్రమునుండి 'త్రికోణము'
9. బిందువునుండి 'బైందవము'

ఇట్లు మూలవిద్యామంత్రములోని '9' అక్షరములనుండి '9' ఆవరణములతో శ్రీచక్రము వెల్లడి అయ్యెను. ఈ విషయమున జ్ఞానార్ణవమిట్లు చెప్పెను.

౭. 'లకారః పృథివీబీజం తేన భూబింబ ముచ్యతే।
సకారః చంద్రమా భద్రే కలాషోడశపత్రకః॥
తస్మాత్ షోడశపత్రం చ హకారః శివ ఉచ్యతే।
అష్టమూర్తిః సదా భద్రే తస్మాద్వసుదలం భవేత్॥
ఈకారస్తు సదా మాయా భువనాని చతుర్దశ।
పాలయన్తీ పరా తస్మాత్ శక్రకోణం భవేత్ప్రియే॥
శక్తి రేకాదశస్థానే స్థిత్వా సూతే జగత్త్రయమ్।
విష్ణోర్యోనిరితి ఖ్యాతా సా విష్ణో ర్దశరూపకమ్॥

ఏకారా త్పరమేశానీ చక్రం వ్యాప్య విజృంభితా।
దశకోణకరం తస్మా ద్రకారో జ్యోతి రవ్యయః॥
కలాదశాన్వితో వహ్నిః దశకోణ ప్రవర్తకః।
కకారా న్మదనో దేవి శివం చాష్టస్వరూపకమ్॥
యోనివశ్యం తదా చక్రం వసుయోన్యంకితం భవేత్।
అర్ధమాత్రా గుణాన్ సూతే నాదరూపా యతస్తతః॥
త్రికోణరూపా యోనిస్తు బిందునా బైందవం భవేత్।
కామేశ్వర స్వరూపం తద్విశ్వాధార స్వరూపకమ్॥
శ్రీచక్రం తు వరారోహే శ్రీవిద్యా వీర్య సంభవమ్॥' భావము-స్పష్టం

ర. శ్రీచక్రము-అందు కొన్ని విషయములు భక్తులకొఱకు ఇవ్వబడినవి. శ్రీచక్రమున 'పరిథినుంచి మధ్యకు' ఈ విషయములు వ్రాయబడినవి.

1. చతుష్కోణము-ఈ పరిధి '**భూపురము**' అందురు. ఇది'4'కోణములు. పృథివీతత్త్వము. త్రైలోక్యమోహనచక్రము. ప్రకటయోగినులు. దీనియందు అణిమాదిసిద్ధులు, వామాదిశక్తులు, బ్రాహ్మీ మొ॥మాతృకలు గలవు. 'బీజము= లం'

2. పైదాని లోపల **షోడశదలపద్మము**-'16' దళములు గల పద్మము గలదు. సర్వాశాపరిపూరకచక్రము. గుప్తయోగినులు. దీని యందు నిత్యలు '16'గలవు. కామాకర్షిణి మొ॥శక్తులు; 16 స్వరములు- అచ్చులు; పృథివ్యాది భూతములు-5; ఇంద్రియములు-10; మనసు-1; మొత్తము 16 ఇందు గలవు. ఈనిత్యలు'15తిథులు+కల'. కనుక చక్రము కాలస్వరూపము అనదగును. ఈ 'కల'ను ధ్రువకల అందురు. ఇది కాలాతీతము. మహాకాలస్వరూపమైన 'దేవి' తలపై నుండునది. 'బీజము-సం'

3. పైదాని లోపల '**అష్టదలపద్మము**'గలదు. ఇది సర్వసంక్షోభిణీ చక్రము. గుప్తతరయోగినులు. అష్టమూర్తి స్వరూపము. ఇందు అనంగకుసుమాది శక్తులు; పరదేవతయొక్క అవ్యక్త తత్త్వము; అహంకారము; మహత్తత్త్వము;

# శ్రీనీరాజన


బిందువు


త్రికోణము


అష్టకోణము


అంతర్దశారము


బహిర్దశారము


చతుర్దశారము


అష్టదలపద్మము


షోడశదలపద్మము


భూపురము

60 (b)





# శ్రీచక్రము

పంచభూతసూక్ష్మరూపములైన 'తన్మాత్రలు' గలవు. 'బీజము-హం'

4.పైదాని లోపల, కోణాత్మకమైన **'చతుర్దశారచక్రము'** కలదు. ఇది సర్వ సౌభాగ్యదాయకచక్రము. సంప్రదాయయోగినులు. 14 భువనములు; దేవతలు; సర్వసంక్షోభిణీ మొ॥ 14 శక్తులు గలవు. దీనికి 'మన్వస్రము' అని పేరు. మను-14, అస్రము-అంచులు, గలది. ఇందు ఇంద్రియములు 10, అంతఃకరణ చతుష్టయము అనగా మనోబుద్ధి చిత్త అహంకారములు గలవు. 'బీజము-ఈం'.

5.పైదాని లోపల, 10 అంచులుగల **'బహిర్దశారచక్రము'** గలదు. దీనిని సర్వార్థసాధక చక్రము అందురు. కులోత్తీర్ణ యోగినులు 10. పరదేవతయొక్క దశేంద్రియములు దశావతారస్వరూపము. 'బీజము-రం'

6.పైదాని లోపల, 10 అంచులుగల మఱొక చక్రము **'అంతర్దశారము'**. దీనిని సర్వరక్షాకర చక్రము అందురు. గర్భయోగినులు 10 మంది దీనికి దేవతలు. 'బీజము-ఏ'

7.పైదాని లోపల, '8' కోణముల చక్రము **'అష్టకోణము'**. ఇది సర్వరోగహర చక్రము. దీనియందు వశిన్యాది వాగ్దేవతలు 8మంది గలరు. వీరిని రహస్య యోగినులు అందురు. 'బీజము-క'

8.పైదానిలోపల, '3' కోణములు గలది **త్రికోణము.** 3 బిందువులు, 3 పీఠములు. సర్వసిద్ధిప్రదచక్రము. అతిరహస్యయోగినులు. 'బీజము-నాదము'

౧. ఉత్తరబిందువు-జాలంధరపీఠము-ఉమామహేశ్వరులు.

౨. దక్షిణబిందువు-పూర్ణగిరిపీఠము-లక్ష్మీనారాయణులు.

3. అగ్రబిందువు-కామగిరిపీఠము-వాణీహిరణ్యగర్భులు.

ఈ చక్రమును సర్వసిద్ధిప్రదా చక్రము అందురు.

9. త్రికోణమధ్యమున **'బిందువు'** గలదు. ఇది సర్వానందమయచక్రము. దీనిని ఓడ్యాణపీఠమందురు. చంద్రకలాచక్రమందురు. ఈ బిందువునే 'శబలబ్రహ్మ' అందురు. ఇది శివశక్తి మిథునము. అర్ధనారీశ్వరము. 'బీజం-ఓం/క్లీమ్'

10. శ్రీ చక్రమును '2' రకములుగా చూడవలెను. ౧. సృష్టిక్రమము-అనగా

బిందువు నుంచి చతుష్కోణము వఱకు. అనగా దేవియొక్క మూలస్థితినుంచి కనబడు ఈ సృష్టి వఱకు జరిగిన వరుస. దీని వివరణ...

పరమాత్మ ఒక పూర్ణస్వరూపము.'O'. ఈయన యందు సృష్టిచేయ వలెనను 'స్పందన' కలిగినది. ఈ స్పందనయే 'విమర్శ' శక్తి అయిన దేవి. అంత వఱకు ఈ 'దేవి' బిందువునందు అంతర్లీనముగా నున్నది. ఈమెయందు ప్రతిబింబించిన స్పందన అంగనారూపము దాల్చినది. అది 'త్రికోణము' అనగా 'త్రిగుణములు'గా ఆవిర్భవించినది. బిందువు శివశక్తి మిథునము. దీని నుంచి ఆవిర్భవించిన అంగన త్రిగుణాత్మిక. అనగా ఇది శ్రీచక్రమునందు సృష్టి ఆరంభమున చూపిన బిందుత్రికోణ పరమార్థము. దీనియందలి ప్రతిబిమ్బము ఈశ్వరచైతన్యము. ఈ సముదాయమునుండి 'మనస్సు' అనబడు మహత్తత్త్వము వచ్చినది. వీనినుండి మిగిలినవి వచ్చినవి. చివఱకు భూమిసృష్టితో ఆగినది.

౨. చతుష్కోణముతో మొదలయి బిందువుదాకా పోవునది సంహారక్రమము. అది భూమినుంచి బిందువువఱకు వెళ్లునది.

11. మన దేహము శ్రీచక్రస్వరూపము. దేహమునందవి షట్చక్రములు. శ్రీచక్రమందు అంతర్భవించును.

12. దేహమందు కాలచక్రముగలదని యోగశాస్త్రము.

'సంవత్సరాత్మకం దేహం ఖల్వాగ్ని శివశక్తికమ్' - చక్రకౌముది మూలాధారమునుంచి ఆజ్ఞవఱకు ఋతువులను చెప్పినారు. భ్రూమధ్యమున శరదృతువు. వీనినిబట్టి దేహము కాలచక్రములో, కాలము దేహచక్రములో నున్నట్లు తెలియుచున్నది.

13. 'మూలవిద్య, వర్ణమాల, ప్రపంచము, కాలము, దేహము' అన్నియును పడుగుపేకలుగా, విత్తనములో చెట్టువలె, చెట్టునందు విత్తనమువలె, పుత్రుని యందు జనకునివలె, జనకునియందు పుత్రునివలె, పాలయందు వెన్నవలె, వెన్నయందు పాలవలె అల్లుకొనిపోయియున్నది.

'చక్రం త్రిపురసుందర్యాః బ్రహ్మాండాకార మీశ్వరి' - అని ప్రమాణము.

14. కనుక అద్వైతులు తాదాత్మ్యోపాసన ద్వారా తమను శ్రీదేవియందో, పర బ్రహ్మమునందో లీనము చేసికొనెదరు. అందుకు సాధనగా ఉపాసన లేదా **భావన** చేయబడును.

అవతారిక:- పూర్ణాభిషేక సిద్ధుడైన సాధకునకు శ్రీచక్రావరణ పూజానంతరము పరాశక్తిపూజ అవశ్య కర్తవ్యము కనుక మూలవిద్యను ప్రదర్శించుచున్నాడు.

శ్లో॥ బిన్దుప్రాణ విసర్గ జీవ సహితం బిన్దుత్రిబీజాత్మకం
షట్ కూటాని విపర్యయేణ నిగదే త్తార త్రిబాలాబలైః।
ఏభిః సమ్పుటితం ప్రజప్య విహరే త్ప్రాసాద మన్త్రం పరం
గుహ్యాద్గుహ్యతమం సయోగజనితం సద్భోగమోక్షప్రదమ్॥ ౨౯

ప్రతిపదార్థము:- బిందు- బిందువు'O', ప్రాణ- 'హ'కారము, విసర్గ- ః, జీవ- 'స'కారవములతో, సహితమ్- కూడినదైన, 'హంసః' అను పదవును, బిందుత్రి- బిందువుతో మొదలైన, విసర్గతో మొదలైన, బిందువిసర్గలతో మొదలైన, బీజాత్మకమ్- బీజస్వరూపము గలుగునట్లుగా, తారత్రి- మూడు ప్రణవములచే, అనగా ఓం హ్రీం శ్రీం బీజములతో, బాలాబలైః- బాలాబీజములతో, బల బీజములతో, షట్-6, కూటాని- ఖండములను, విపర్యయేణ- ఎదురు బదురుగా, నిగదేత్- జపింపవలయును, గుహ్యాద్గుహ్యతమమ్- రహస్యాతిరహస్య మైనదియు, సద్భోగ- మంచిభోగములను, మోక్ష- మోక్షమును, ప్రదమ్- ఇచ్చు నట్టిదియు, సయోగజనితమ్- సకారముతో కల్పుట ద్వారా పుట్టింపబడిన, పరమ్- పరాబీజమైన అనగా హకారస్వరూపమైన, ప్రాసాదమంత్రమ్- ఔంకార మంత్రమును, ఏభిః- పైన చెప్పి కూటములతో, సంపుటితమ్- సంపుటీకరింప బడినట్లుగా, ప్రజప్య- జపించి, విహరేత్- విహరింపవలయును.

తాత్పర్యము:- ఈ శ్లోకమునందు ఒక క్రొత్త మంత్రమును అస్పష్టముగా సూచించుచున్నాడు.

'హంస' మంత్రమును 3 రకాలుగా చెప్పినాడు.

౧. హంసః, ౨. సోహం, 3. అం హంసః అః సోహం.

ఉద్ధరింపలేదని కూడా చెప్పెను. అది ఏదో మాత్రము చెప్పలేదు. బహుశః 'కామకల' కావచ్చును.

2. ఈ మంత్రమునందు 'ఎదురుబదురు'గా ఉన్న కూటములు ఒక ప్రత్యేకత. అందులో 'హ్స్రాం' వఱకు ఒక ఖండము. పైనుంచి క్రిందికి ఇహలోకమునకు వచ్చు వరుస. కనుక భోగవిద్య, 'స్హ్రాః' వద్దనుంచి ఒక ఖండము. అది ఊర్ధ్వముఖము. ఈ ఖండము సంహారక్రమమున గలదు. కనుక మోక్షవిద్యగా పనికి వచ్చును. కనుక దీనిని 'సద్భోగమోక్షప్రదమ్' అని చెప్పెను.

3. సంస్కృత వ్యాఖ్యానమున 'హ్ర్యాం', 'హ్రౌః' అని బీజాక్షరవములు చెప్పబడినవి. కాని ఇవి 'హ్స్రాం', స్హ్రాః' అని యుండవలయును. లేనిచో **సయోగ జనితమ్** అను విశేషణము కుదరదు. దాని అర్థము పరాప్రాసాద మంత్రమునకు సకారము కలుపవలెనని అర్థము. పరాప్రాసాదమంత్రము అనగా 'హౌం' అని వ్యాఖ్యాతయే చెప్పినాడు. మఱి దీనికి సకారము కలిపినచో 'హ్ర్యాం హ్రౌః' అనునవి అసాధ్యము. కనుక అది అచ్చుతప్పు కావచ్చును.

**అవతారిక:**- దేవికి సర్వోపచారపూజ గావించి తన మనస్సున నిలువుమని శ్రీదుర్వాసముని ప్రార్థన చేయుచున్నాడు.

శ్లో॥ ఆతామ్రార్క సహస్రదీప్తిపరమా సౌన్దర్యసారై రలం
లోకాతీత మహోదయై రుపయుతా సర్వోపమాగోచరైః।
నానానర్ఘ్యవిభూషణై రగణితై ర్జాజ్వల్యమానాభితః
శ్రీమాత స్త్రిపురారిసున్దరి కురు స్వాన్తే నివాసం మమ॥ 30

**ప్రతిపదార్థము:**- **శ్రీమాతః**- ఓ శ్రీమాతా!, త్రిపురారిసున్దరి- త్రిపురహరుడైన శివుని అర్ధాంగీ, ఆతామ్ర- అరుణ వర్ణమైన, అర్క- బాలసూర్యుల యొక్క, సహస్ర- సహస్రములయొక్క, దీప్తి- కాంతిచే, పరమా- సర్వాధికురాలవు, లోకాతీత- లోకములను దాటిన, మహోదయైః- ఉత్కర్షగలవియు, సర్వోపమా - సమస్త ఉపమానములకు, అగోచరైః- అందనివియు అగు, సౌన్దర్యసారైః- సారమైన సౌందర్యములతో, అలమ్- సరిపడా, ఉపయుతా- కూడినదియు, అగణితైః - అసంఖ్యమైన, నానా- అనేక విధములైన, అనర్ఘ్య- అమూల్యమైన, విభూషణైః-

ఆభరణములతో, అభితః- అంతట, జాజ్వల్యమానా- ప్రకాశించునదియు అగు నీవు, మమ- నా యొక్క, స్వాన్తే- మనస్సునందు, నివాసమ్- నివాసమును, కురు- చేయుము.

**తాత్పర్యము:** - శ్రీమాతా! త్రిపురహర సుందరీ, త్రిపురాదేవీ! నిరుపమానమైన లోకోత్తర సౌందర్యముతో బహువిధ అమూల్య భూషణములతో, జాజ్వల్యమానమైన నీ దివ్యసుందరమూర్తి, అరుణాదిత్యప్రభామూర్తి నా మనస్సున నిత్యము నిలుచుగాక!

**విశేషములు:** -

దేవి కురువిందమణిప్రభ. సౌందర్యశేవధి, ఆమె కాంతులు అణిమాదిసిద్ధులు, ఆమె శరీరము సచ్చిదానందము. ఆ విషయము ఈ శ్లోకమునందు చెప్పబడినది.

'ధ్యాయే త్కామేశ్వరాఙ్కస్థాం కురువిన్దమణిప్రభామ్
సచ్చిదానన్దవపుషం సదయాపాఙ్గవిభ్రమామ్
స్వాభిః అణిమాద్యాభిః సేవ్యాం సర్వనియామకామ్'

అను షోడశీ ప్రార్థనను ఇచ్చట గమనింపవలయును.

**అవతారిక:** - ఈ శ్లోకమునుంచి దేవికి పాదాదికిరీటాంత వర్ణన జరుగుచున్నది.

శ్లో॥ శిఞ్జన్నూపుర పాదకఙ్కణ మహాముద్రా సులాక్షారసా-
లఙ్కారాఙ్కితమఙ్ఘ్రి పఙ్కజయుగం శ్రీపాదుకాలఙ్కృతమ్।
ఉద్భాస్వన్నఖ చన్ద్రఖణ్డరుచిరం రాజ జ్జపాసన్నిభం
బ్రహ్మాది త్రిదశాసురార్చిత మహం మూర్ధ్ని స్మరామ్యమ్బికే॥ 30

**ప్రతిపదార్థము:** - శిఞ్జన్నూపుర- గల్లు గల్లుమను అందెలతోను, పాదకఙ్కణ- కాలికడియములతోను, మహాముద్రా- ముద్రలతోను( అచ్చులతోను), సులాక్షా రస- పారాణి రంగుతోను, అలంకార- అలంకారములతోను, అంకితమ్- కూడినదియు, శ్రీపాదుకా- చింతామణి పాదుకలతో, అలంకృతమ్- అలంకరింపబడినదియు, ఉద్భాస్వత్- ప్రకాశించుచున్న, నఖ- గోళ్లు అనే, చంద్రఖండ- చంద్రరేఖలతో, రుచిరమ్- అందమైనదియు, రాజత్- వెల్గుచున్న, జపా- జపా పుష్పముతో, సన్నిభమ్- సమానమైనదియు, బ్రహ్మాది- బ్రహ్మ మొదలగు,

త్రిదశ-దేవతలచేత, అసుర-రాక్షసులచేత, అర్చితమ్-పూజింపబడినదియు అగు, అంఘ్రిపంకజయుగమ్-పాదపద్మద్వయమును, మూర్ధ్ని-తలయందు, స్మరామి-స్మరించెదను.

**తాత్పర్యము:**-గల్లు గల్లుమను అందెలు,కడియములు,ముద్రలు,పారాణి చాఱలువంటి అలంకారములతో, చింతామణి పాదుకలతోఅలరారుచు,బాల చంద్రులవంటి 10గోళ్లతో మెఱయుచు,జపాపుష్ప సమానమైన, బ్రహ్మాది దేవార్చితమైన నీ పాదాంబుజద్వంద్వమును నా మనస్సున స్మరించెదను.

**విశేషములు:**-

౧.'నఖదీధితిసంఛన్న నమజ్జన తమోగుణా' మఱియు 'శింజానమణి మంజీర మండిత శ్రీపదాంబుజా' అను శ్రీలలితాసహస్రనామములు ఈ శ్లోకమున సూచింపబడినవి.

౨. చింతామణులతో నిర్మితమైన పాదుకలు అనగా 'పావుకోళ్లు' కూడా మన కోరికలు తీర్చగలవు అని చెప్పబడినది.

౩.అట్టి 'దేవి'వద్ద సామాన్యవాంఛలు,సంసారచింతలు చెప్పుట తుచ్ఛ విషయము అని మనకు సూచించినట్లు అయినది.

౪.పాదవర్ణనలో దేవి పాదములు నిత్యకల్యాణమూర్తులు అని సూచింప బడెను.

**అవతారిక:**-దేవి యొక్క నితంబమును వర్ణించుచున్నాడు.

శ్లో॥ ఆరక్త చ్ఛవినాతిమార్దవయుజా నిశ్వాసహార్యేణ స-
త్కౌశేయేన విచిత్రరత్న ఖచితై ర్ముక్తాఫలై రుజ్జ్వలైః।
కూజత్కాఞ్చన కిఙ్కిణీభి రభితః సంనద్ధ కాఞ్చీగుణై
రాదీప్తం సునితమ్బబిమ్బ మరుణం తే పూజయామ్యమ్బికే॥ ౩౨

**ప్రతిపదార్థము:**-అమ్బికే-అమ్మా!, ఆరక్తచ్ఛవినా-అరుణకాంతి గలదియు, అతిమార్దవయుజా-మిక్కిలి మృదువైనదియు, నిశ్వాసహార్యేణ-నిట్టూర్పు గాలికే చెదురునంతపలుచనిదియు అగు, కౌశేయేన-పట్టువస్త్రముతోను, విచిత్ర-వివిధములైన, రత్న-రత్నములతో, ఖచితైః-కలిపి గ్రుచ్చబడిన, ఉజ్జ్వలైః

-ప్రకాశమానమైన, ముక్తాఫలైః- మంచి ముత్తెములతోను, కూజత్- మ్రోగుచున్న, కాంచన కింకిణీభిః- బంగారు గజ్జెలతోను, అభితః- అన్నివైపులను, సంనద్ధ-కట్ట బడిన, కాంచీగుణైః-నడుమును బిగించు బంగారుత్రాళ్లతోను, ఆదీప్తమ్- వెలిగినదియు, , అరుణమ్-ఎఱ్ఱనిదియు, అగు, తే-నీ, సునితమ్బబిమ్బమ్- నితంబ భాగమును, పూజయామి-పూజించెదను.

**తాత్పర్యము:**-నిట్టూర్పు గాలిచే చెదురునంత నాణ్యమైన ఎఱ్ఱని మెత్తని పట్టుచీర, రత్నములతో ముత్యాలతో, బంగరుగజ్జెలు కలిపిగ్రుచ్చిన కాంచీ గుణములతో అలరారు నీ నితమ్బ(పిఱుదు) భాగమును ధ్యానించెదను.

**విశేషములు:**-

౧.'అరుణారుణ కౌసుంభవస్త్రభాస్వత్కటీతటీ మఱియు రత్నకింకిణికా రమ్యరశనాదామభూషితా' అను శ్రీలలితాసహస్రనామములు విపులీకరింప బడినవి.

౨.మూలాధారమునందు యోగులకు ఒక ఆకారము ప్రత్యక్షమగును. అది తెల్లని ఏనుగు అని చెప్పబడును. కొందఱు దానినే వృషభము అందురు. ఈ ప్రకారము ఆలోచించినచో మూలాధారమునుండి బయలుదేఱు నాద, మంత్ర వర్ణరూపమగు యోగసామగ్రిని మౌక్తికములు అనవచ్చును. అనగా ముక్తి సంబంధమైనవనియు అర్థము రాగలదు. మౌక్తికములకు పర్యాయపదముగా ముక్తాఫలములు మొ॥ వాడబడును. కనుక యోగదర్శనమునందలి 'ఏనుగు'ను ఊహించి సంస్కృత వ్యాఖ్యాత ముక్తాఫలములు అన్నచోట 'ఏనుగు కుంభ స్థలముల నుండి వచ్చిన' అని చెప్పినాడు. 'ముత్యములు' ఏనుగు కుంభస్థలము లందు దొరకునని కవి సమయము కలదు.

3.31,32 శ్లోకములో కవి 'దేవి'ని నాదమయిగా చెప్పినట్లయినది. 31లో 'కాలిఅందెల ధ్వనులు', 32లో 'మ్రోగుచున్న బంగారుగజ్జెలు' చెప్పుటలోని స్వారస్యమిది.

**అవతారిక:**-చన్దనలేపనము, మణిమాలికలతో అలంకృతమైన దేవీస్తనద్వయము ను వర్ణించుచున్నాడు.

శ్లో॥ కస్తూరీఘనసార కుఙ్కుమరజోగన్ధోత్కటై శ్చన్దనై
రాలిప్తం మణిమాలయాతిరుచిరం గ్రైవేయహారాదిభిః।
దీప్తం దివ్యవిభూషణై రగణితై ర్జ్యోతి ర్విభాస్వ త్కుచ
వ్యాజస్స్వర్ణఘటద్వయం హరిహరబ్రహ్మాదిపీతం భజే॥ 33

**ప్రతిపదార్థము:-** జనని- తల్లీ, కస్తూరీ- కస్తూరియొక్క, ఘనసార- పచ్చ కర్పూరముయొక్క, కుంకుమ- కుంకుమయొక్క, రజోగన్ధ- చూర్ణ పరిమళము చే, ఉత్కటైః- ఘాటు అయిన, చందనైః- చందనగంధములతో, ఆలిప్తమ్- పూయబడినదియు, మణిమాలయా- మణిమాలికలచేత, అతిరుచిరమ్- మిక్కిలి అందమైనదియు, గ్రైవేయహారాదిభిః- గొలుసులు, ముత్యాలహారాల తో, దీప్తమ్- ప్రకాశమానమైనదియు, అగణితైః- అసంఖ్యాకములైన, దివ్య విభూషణైః- దివ్యాభరణములతో, జ్యోతిః- తేజః పదార్థమువలె, విభాస్వత్ - వెలుగుచున్నదియు, హరిహరబ్రహ్మాదిపీతమ్- త్రిమూర్తులు మున్నగువారిచే త్రాగబడినదియు అగు, కుచవ్యాజ- స్తనములు అను పేరుగల, స్వర్ణఘటద్వయమ్ - బంగారు కలశద్వయమును, భజే- సేవించెదను.

**తాత్పర్యము:-** తల్లీ, కస్తూరి మొ॥ పరిమళద్రవ్యములతో కలిపిన సుగంధములు అద్ది, మణిమాలతో, ముత్యాలహారములతోను, కంఠభూషణములతోను, అనేకానేక దివ్యభూషణములతో 'కాంతిపుంజము' వలె బాగా ప్రకాశించుచున్న నీ 'స్తన హేమ కలశముల'ను సేవించెదను. వానిని త్రావియే త్రిమూర్తులంతటివారు 'అంతటివారు' అయినారు.

**విశేషములు:-**

౧. 'రత్నగ్రైవేయచింతాకలోలముక్తాఫలాన్వితా' మఱియు 'కామేశ్వరప్రేమ రత్న మణి ప్రతిపణ స్తనీ' అను శ్రీలలితాసహస్రనామములు సూచింపబడినవి.

౨. 'హారహారికుచాభోగా' అను శ్రీలలితాత్రిశతీ నామము సూచితము.

3. స్తనములు- 'జ్యోతిః విభాస్వత్' అనుటలో అవి 'సూర్యచంద్రులు' అని భావము. ఇందుకు సౌభాగ్యభాస్కరమున ఒక శ్లోకము గలదు.

'సూర్యచంద్రౌ స్తనౌ దేవ్యాః తావేవ నయనే స్మృతౌ।
ఉభౌ తాటంకయుగలం ఇత్యేషా వైదికీ శ్రుతిః॥'

౪. ఆచార్య శ్రీ శంకరులు గూడా దేవీస్తనములను 'రవీన్దువులు'గా చెప్పిరి. అంతేగాక, 'క్లీం' బీజమునందలి 'క'కారముతో సామ్యము చెప్పిరి.

'ముఖం బిందుం కృత్వా కుచయుగ మధః తస్య తదధో
హరార్థం ధ్యాయేద్యో హరమహిషి తే మన్మథకలామ్।
ససద్యః సంక్షోభం నయతి వనితా ఇత్యతిలఘు
త్రిలోకీమప్యాశు భ్రమయతి రవీన్దుస్తనయుగామ్॥'

ఇందు నాగరిలిపిలోని 'క్లీం' లో పై బిందువు దేవీముఖము. క్రింద ఉన్న 'క'కారము స్తనయుగము, దానిక్రింద ఉన్న 'ల'కారము త్రికోణము అని రూపు కట్టినారు. హరార్థము అనగా త్రికోణము అని యర్థము. ప్రకృతియంతటికి సూర్యచంద్రులు ప్రాణఅమృతదాతలు కనుక 'సూర్యచంద్రులు' దేవీస్తనములు. మనకు ప్రాణాధారములు.

౫. **అపీతకుచామ్బికా-** ఈ దేవత 'అరుణాచలము'న గలదు. 'త్రాగబడని చన్నులు గలది' అని అర్థము. అనగా గణపతి ఆమె కన్నబిడ్డ గాదు. కుమారస్వామిని ఆమె కనలేదు. ఆయనకు పాలు 'కృత్తికలు' ఇచ్చిరి. కనుక దేవి 'అపీతకుచ' కనుక 'అపీతకుచామ్బిక' అయినది.

**అవతారిక:**- పరదేవతా బాహుచతుష్టయమును, కంఠమును వర్ణించుచున్నాడు.

శ్లో॥ ముక్తారత్నవిచిత్రకాన్తిలలితై స్తే బాహువల్లీరహం
కేయూరాఙ్గద బాహుదణ్డవలయై ర్హస్తాఙ్గుళీభూషణైః।
సంపృక్తాః కలయామి హీరమణిమన్ముక్తావలీకీలిత
గ్రీవాపట్ట విభూషణేన సుభగం కణ్ఠం చ కమ్బుశ్రియమ్॥ 3౪

**ప్రతిపదార్థము:**- హే దేవి- ఓ దేవీ, ముక్తా- ముత్యములయొక్క, రత్న- రత్నములయొక్క, విచిత్ర- చిత్రమైన, కాంతి- కాంతిచేత, లలితైః- అందమైనవి యగు, కేయూర- మురుగులచేత, అంగద- వంకీలచేత, బాహుదండ- కటకముల

చేత, వలయైః-గాజులచేత, హస్తాంగులీభూషణైః- ఉంగరములు మొ॥ వానిచేత, సంపృక్తాః-కలిసిన, తే- నీ, బాహువల్లీః- తీగలవంటి చేతులను, కలయామి- ధ్యానించెదను, చ- మఱియు, హీరమణిమత్- వజ్రమణులతో గూడిన, ముక్తావలీ- ముత్తెములతో, కీలిత- గ్రుచ్చబడిన, గ్రీవాపట్ట విభూషణేన-మెడ పట్టెడతో, సుభగమ్- అందమైనదియు, కంబుశ్రియమ్- శంఖమువలె వృత్తమై 3 గీతలు గలదియు అగు, తే- నీ, కంఠం చ- కంఠమునుగూడా, కలయామి- ధ్యానించెదను.

**తాత్పర్యము:**- ముత్యములు రత్నములు పొదిగిన కేయూరాంగదములతో మెఱయుచున్న నీ బాహువల్లి కలను సేవించెదను. అట్లే వజ్రములు ముత్యములు కలగలిపి తయారుచేసిన పట్టెడతో మెఱయుచున్న నీ కమ్బుకణ్ఠమును ధ్యానించెదను.

**విశేషములు:**-

౧.'కనకాంగదకేయూర కమనీయ భుజాన్వితా', 'ఉద్యద్భాను సహస్రాభా చతుర్బాహుసమన్వితా' అను శ్రీలలితాసహస్రనామములు సూచితములు.

౨.ఈ యాభరణములన్నియు మంత్రములు. అందలి మణులన్నియు పంచాశ ద్వర్ణములు బీజాక్షరములు. దేవి మాతృకాస్వరూప మఱియు మంత్రస్వరూప కదా. సౌభాగ్యభాస్కరమునందుగల ఈ వాక్యమును గమనింపగలరు.

'దేవ్యాః త్రీణి రూపాణి కరచరణాది విశిష్టం స్థూలమ్।
మంత్రమయం సూక్ష్మమ్ వాసనామయం పరమ్॥'

కనుక, దేవీ సూక్ష్మరూపమే మంత్రము.

3.'బాహువల్లికల'ను కల్పవృక్ష శాఖలుగా చెప్పిన చోట్లు గలవు.

**అవతారిక:**- దేవీ ప్రసన్నవదనమును వర్ణించుచున్నాడు.

శ్లో॥ ఉద్యత్పూర్ణకలానిధిశ్రి వదనం భక్తప్రసన్నం సదా
సంపుల్లామ్బుజ పత్రకాన్తి సుషమా ధిక్కార దక్షేక్షణమ్।
సానన్దం కృతమన్దహాస మసకృ త్ప్రాదుర్భవ త్కౌతుకమ్
కున్దాకార సుదన్తపఙ్క్తి శశిభా పూర్ణం స్మరామ్యమ్బికే॥ 3౦

**ప్రతిపదార్థము:** - అమ్బికే- తల్లీ, ఉద్యత్- ఉదయించుచున్న, పూర్ణకలానిధిశ్రీ -పూర్ణచంద్ర సంపద కలదియు, సదా- నిత్యము, భక్తప్రసన్నమ్- భక్తులయందు ప్రసన్నమైనదియు, సంపుల్లామ్బుజ- వికసించిన పద్మములయొక్క, పత్ర- దళము లయొక్క, కాన్తిసుషమా- కాంతిశోభయొక్క, ధిక్కార- తిరస్కరించుట యందు, దక్ష- సమర్థమైన, ఈక్షణమ్- లోచనములు గలదియు, సానందమ్- నిత్యము ఆనందమైనదియు, కృతమందహాసమ్- దరహాసము చేసినదియు, అసకృత్- పలుమార్లు, ప్రాదుర్భవత్- కలుగుచున్న, కౌతుకమ్- భక్త కుతూహలము కలదియు, కుందాకార- మొల్లమొగ్గల వంటి, సుదంతపంక్తి- పలువరుస యొక్క, శశిభా- వెన్నెలచే, పూర్ణమ్- నిండినదగు, తే- నీ, వదనమ్- ముఖమును, స్మరామి- స్మరించుచున్నాను.

**తాత్పర్యము:** - అమ్బికా, తామరదళములను ధిక్కరించు విశాల నేత్రములు, మొల్లమొగ్గలవలె తెల్లగా చంద్రకాంతులు విరజిమ్ము దంతములు, తొణికిసలాడు అందము, అందమైన మందహాసము, భక్తపరిశీలనా కుతూహల తరంగములు గలిగి, ఉదయపూర్ణచంద్రసన్నిభమైన, భక్తులపట్ల నిత్యప్రసన్నమైన నీ ముఖము ను నా మనస్సున ధ్యానించెదను.

**విశేషములు:** -

౧. 'శుద్ధ విద్యాంకురాకార ద్విజపంక్తి ద్వయోజ్జ్వలా', మఱియు 'మందస్మిత ప్రభాపూర మజ్జత్కామేశ మానసా' అను శ్రీలలితాసహస్రనామములు సూచింపబడినవి.

౨. 'పూర్ణకలా' అనుటవలన దేవి షోడశకలాస్వరూపురాలని సూచితము.

3. దేవి ముఖము 'వాగ్భవఖండము'. సారస్వతము. పైగా ముఖభాగము సర్వజ్ఞానమయము. ఇవి అన్నియు తెలుపును సూచించును. అందువలన ఈ 'ముఖ' వర్ణనమున తెలుపును ఎఱుపును గూడా సూచించెను. మందహాసము, దంతకాంతిచంద్రికలు తెలుపునకు సూచన. 'ఉదయచంద్ర' సామ్యము ఎఱుపుకు సూచన.

౪. సంఫుల్లామ్బుజపత్ర - దీని వలన షట్చక్ర కమలములు సూచింపబడినవి. వాటిని ధిక్కరించి పైకి నడచిననే 'ఆమె' వదనము చూడగలము అని సూచన. షట్చక్రకమలములు అధోముఖములై సంకోచించియుండుట సంసారమునకు అజ్ఞానమునకు గుర్తు. అవి ఊర్ధ్వముఖములై వికసించియుండుట సఫలమైన యోగసాధనకు గుర్తు. అట్టి స్థితిలో ఉదయించు పూర్ణకల 'షోడశి' అనబడు 'సాదా' కల కనుక అది భక్తులకు అనగా సాధకులకు ప్రసన్నమై కనబడును కనుక శ్లోకము 1,2పాదములు యోగరహస్యమును చెప్పుచున్నవి.

**అవతారిక:** - ఈ శ్లోకమునందు శ్రీదుర్వాసమహాముని అమ్మవారి నాసాకర్ణము లను వర్ణించుచున్నాడు.

శ్లో॥ తప్తస్వర్ణకృతోరుకుణ్డలయుగం మాణిక్య ముక్తోల్లసత్
హీరాబద్ధ మనన్యతుల్య మపరం హైమం చ చక్రద్వయమ్।
శుక్రాకార నికార దక్ష మమలం ముక్తాఫలం సున్దరమ్
బిభ్రత్కర్ణయుగం భజామి లలితం నాసాగ్రభాగం శివే! ॥౩౬

**ప్రతిపదార్థము:** - హే శివే- ఓ పార్వతీ, మాణిక్య- మాణిక్యములచే, ముక్తా- ముత్యములచే, ఉల్లసత్- ప్రకాశించుచున్న, తప్తస్వర్ణకృత- మంచిబంగారముతో చేయబడిన, ఉరుకుండలయుగమ్- గొప్ప కుండలద్వంద్వమును, అనన్యతుల్యమ్ - దీనితో సమానముకాని మఱొక, హీరాబద్ధమ్- వజ్రములు పొదిగిన, హైమమ్ - బంగారపు, చక్రద్వయమ్ చ- (చెవిపైన ధరింపబడు) చక్రముల జాడను, బిభ్రత్- ధరించుచున్న, కర్ణయుగమ్- నీ చెవులను, శుక్రాకార- శుక్రనక్షత్రపు ఆకారమును, నికార - ధిక్కరించుటయందు, దక్షమ్- సమర్థమైన, అమలమ్- నిర్మలమైన, సుందరమ్- అందమైన, ముక్తాఫలమ్- ముత్యమును, బిభ్రత్- ధరించుచున్న, లలితమ్- అందమైన, నాసాగ్రభాగమ్- నీ ముక్కుకొనను, భజామి- సేవించుచున్నాను.

**తాత్పర్యము:** - శివదేవీ!, మాణిక్యమణులతోను మంచిముత్యములతోను చేసిన బంగారు కమ్మలు క్రిందవైపుగను, వజ్రములతో చేసిన సువర్ణచక్రములు గుబ్బలు

పై వైపున ధరించిన నీ చెవులకు నమస్కారము. వేగుచుక్కను మించి వెలుగులీనుచున్న ముత్యపు ముక్కఱ దాల్చిన నీ ముక్కుకొనకు నమస్కారము.

**విశేషములు:-**

౧.'తాటంకయుగలీభూతతపనోడుపమండలా' మఱియు 'తారాకాంతి తిరస్కారి నాసాభరణభాసురా' అను శ్రీలలితాసహస్రనామములు సూచింపబడెను.

౨.సంస్కృతవ్యాఖ్యానమునందు మాణిక్యముక్తాఫలములు గూడా చక్రద్వయమునకే విశేషణముగా చెప్పబడినది. అనగా, చక్రములే మాణిక్యముక్తా వజ్రములతో భాసించునట్లు అర్థము. ఆ పక్షమున తాటంకములు కేవలము బంగారమనియే అర్థము చెప్పవలెను. కాని సంప్రదాయము ప్రకారము 33వ శ్లోక విశేషణములలో చెప్పినట్లు సూర్యచంద్రులు అమ్మవారి తాటంకములు. ఆ పక్షమున ఒక తాటంకము దీప్తిగా ఎఱ్ఱగా, మఱొక తాటంకము చల్లగా తెల్లగా ఉండవలయును. అందువలన 'మాణిక్యముక్తామణులు' కుండలములకే చేర్చవలయును. అపుడు మాణిక్యకుండలముగా సూర్యుడు, ముక్తా కుండలముగా చంద్రుడు సరిపోవును. ఇది శ్రీనీరాజన.

3.పైగా రక్తశుక్ల ప్రభలు దేవికి గుర్తు. గురుపాదుకలకు గుర్తు. ప్రకాశ విమర్శ తత్త్వములకు గుర్తు. కనుక ఈ యర్థము సంప్రదాయబద్ధముకాగలదని భావించటమైనది.

౪.శుక్రుని వెలుగు 'వేగుచుక్క'గా సుపరిచితము. ఆమె ముక్కు రాబోవు జ్ఞానప్రకాశమునకు గుర్తుగా ఈ ఉపమానము చెప్పబడినది.

**అవతారిక:**-అమ్మవారి జడను స్తుతించుచున్నాడు.

శ్లో॥ జాతీ చమ్పక కున్ద కేసర రజోగన్ధోత్కిర త్కేతకీ
నీపాశోక శిరీష ముఖ్య కుసుమైః ప్రోత్తంసితా ధూపితా।
ఆనీలాఞ్జన తుల్య మత్తమధుపశ్రేణీవ వేణీ తవ
శ్రీమాతః శ్రయతాం మదీయహృదయామ్భోజం సరోజాలయే॥3౭

**ప్రతిపదార్థము:**-సరోజాలయే-కమలవాసినీ, శ్రీమాతః-లక్ష్మీ!, జాతీ-

జాజి, చంపక-సంపెంగ, కుంద-మొల్ల, కేసర-పొగడ లేదా పొన్న, రజోగంధ-పరాగపరిమళములను, ఉత్కిరత్-వెదజల్లుచున్న, కేతకీ-మొగలి, నీప-కడిమి, అశోక-అశోకము, శిరీష-దిరిసెన, ముఖ్య కుసుమైః-మొదలగు పూలతో, ప్రోత్తంసితా-అలంకరింపబడినదియు, ధూపితా-(తడి ఆఱుటకు) సాంబ్రాణి ధూపము వేయబడినదియు, ఆనీల-నల్లని, అంజన-కాటుకవంటి, మత్త-గండు, మధుపశ్రేణీవ-తుమ్మెదల బారువలె ఉన్న, తవ-నీ, వేణీ-జడ, మదీయ-నా, హృదయాంభోజమ్-హృదయ పద్మమును, శ్రయతామ్- ఆశ్రయించుగాక.

**తాత్పర్యము:-** ఓ మహాలక్ష్మీ! జాజి సంపెంగ మొగలి పొన్న కడిమి మొ॥ సుగంధ పుష్పములతో అల్లి ధూపము వేయబడిన, గండుతుమ్మెదలవంటి నీ 'జడ' నా హృదయపద్మమును జేరును గాక.

**విశేషములు:-**

౧. 'చంపకాశోకపున్నాగసౌగంధికలసత్కచా' అను శ్రీలలితాసహస్రనామము సూచితము.

౨. దేవి 'వేణి' ని తుమ్మెదలతో పోల్చుటవలన, తన హృదయమును పద్మముతో పోల్చుటవలన ఉపమానము చక్కగా సరిపోయినది. పైగా, మకరందముకొఱకు తుమ్మెదలు తామే వచ్చును. ఆ విధముగా దుర్వాసుని హృదయము కొఱకు దేవీవేణీయే స్వయముగా రావలయునని కోరుటతో 'బిడాలన్యాయము' సూచింపబడినది. అనగా, పిల్లి తన పిల్లలను అన్ని జాగ్రత్తలు తీసికొని తానే తనతో తీసికొని వెళ్లును. అట్లే దేవి తానే స్వయముగా భక్తహృదయమును ఆశ్రయింపవలెనని భావము.

**అవతారిక:-** దేవి 'శిరస్సు' ను వర్ణించుచున్నాడు.

శ్లో॥ లేఖాలభ్య విచిత్ర రత్న ఖచితం హైమం కిరీటోత్తమం
ముక్తా కాఞ్చన కిఙ్కిణీ గణ మహా హీర ప్రబోధోజ్జ్వలమ్।
చఞ్చచ్చన్ద్ర కలా కలాప లలితం దేవద్రు పుష్పైర్చితమ్
మాల్యై రమ్య విలమ్బితం సుశిఖరం బిభ్రచ్ఛిర స్తే భజే॥ ३८

**ప్రతిపదార్థము:**- అమ్బ- తల్లీ, లేఖ- దేవతలకే, అలభ్య- దుర్లభమైన, విచిత్ర రత్న- రంగురంగుల రత్నములచే, ఖచితమ్- పొదగబడినదియు, ముక్తా- ముత్యముల యొక్క, కాంచన కింకిణీగణ- బంగారు గజ్జెల గుంపుయొక్క, మహాహీర- మహావజ్రముయొక్క, ప్రబోధ- ప్రకాశముచేత, ఉజ్జ్వలమ్- ప్రకాశ వంతమైనదియు, చంచత్- తళతళలాడుచున్న, చంద్రకలా- చంద్రకల అనే, కలాప - భూషణముతో, లలితమ్- మనోహరమైనదియు, దేవద్రు- కల్పవృక్షము యొక్క, పుష్ప- పుష్పములచేత, అర్చితమ్- పూజింపబడినదియు, మాల్యైః- మాలికలచే, విలంబితమ్- వ్రేలాడదీయబడినదియు, సుశిఖరమ్- మంచికొన గలదియు అగు, హైమమ్- బంగారపు, కిరీటోత్తమమ్- శ్రేష్ఠ కిరీటమును, బిభ్రత్ - ధరించునట్టి, తే- నీ, శిరః- శిరస్సును, భజే- సేవించెదను.

**తాత్పర్యము:**- తల్లీ! నీ కిరీటము అత్యంత శ్రేష్ఠమైనది. దేవ దుర్లభమైన విచిత్రరత్నములు, ముత్యములు, బంగారుగజ్జెలు, మధ్యన మహావజ్రము పై భాగమున తళతళలాడు 'చంద్రరేఖ', కల్పవృక్షపుష్పములు, ఆపైన వ్రేలాడుచున్న పుష్పమాలలుగల కొనదేలిన ఆ కిరీటరాజమును ధరించిన నీ శిరస్సును కొలిచెదను.

**విశేషములు:**-

౧. 'మందారకుసుమప్రియా', 'కురువిందమణిశ్రేణీకనత్కోటీరమండితా' అను శ్రీలలితాసహస్రనామములు సూచింపబడినవి.

౨. ఈ శ్లోకస్థానమున మఱొక పాఠమున '2' శ్లోకములు వేఱుగా గలవు. చూ॥

1). 'ఉత్ క్షిప్తం సువర్ణదండకలితం పూర్ణేన్దుబిమ్బాకృతి
ఛ్ఛత్రంమౌక్తిక చిత్రరత్నఖచితం క్షౌమాంశుకోత్తంసితమ్।
ముక్తాజాలవిలమ్బితం సకలశం నానాప్రసూనాఞ్చితం
చంద్రోడ్డామర చామరాణిదధతే శ్రీదేవి తే స్వః స్త్రియః॥'

భావము:- దేవీ, పూర్ణచంద్రునివంటి తెల్లని గొడుగు, దానికి బంగారు కఱ్ఱ, పట్టువస్త్రము, చుట్టు ముత్యాలజాలరులు, కొనపై చిన్న కలశము, పూల

దండలు గలవు. అట్టి నీ తెల్లని పట్టుగొడుగును స్మరించెదను. స్వర్గస్త్రీలు చంద్రునివలె తెల్లని చామరములు పట్టి వీచుచుండిరి.

౨). 'విద్యామంత్రరహస్యవిన్మునిగణైః క్లప్తోపచారార్చనాం
వేదాన్తశ్రుతిగీయమాన చరితాం వేదాన్తతత్త్వాత్మికామ్।
సర్వాస్తా హి తురీయతా ముపగతాః త్వద్రశ్మిదేవ్యః పరాః
త్వాం నిత్యం సముపాసతే స్వవిభవైః శ్రీచక్రనాథే శివే॥'

భావము:- మంత్రవిద్యారహస్యవేత్తలైన మునులు నిన్ను అర్చించెదరు. వేద వేదాంతములు నిన్ను గానము చేయుచున్నవి. నీ రశ్మిదేవతలైన అణిమాది దేవతలు అనంగకుసుమాదిశక్తులు తమతమ వైభవములతో నిన్ను సేవించుచున్నారు.

సమీక్ష:- ఈ '2' శ్లోకములలో మొదటిదానికి సందర్భశుద్ధిగలదు. కాని దానికి వ్యాఖ్యానము లేదు. కారణము వ్యాఖ్యాతకు దొరికిన గ్రంథములో ఈ పాఠము లేదు. 2వశ్లోకము కవితాపరముగా దుర్బలము, సందర్భశుద్ధియులేదు. పాఠకుల సౌలభ్యముకొఱకు ఈ '2' శ్లోకములకు భావము వ్రాయబడినది.

**అవతారిక:**- పరదేవతయొక్క ఫాలసీమను అధరబిమ్బమును దేహమును వర్ణించుచున్నాడు.

శ్లో॥ శృఙ్గారాదిరసాలయం త్రిభువనై ర్మాల్యై రతుల్యై ర్యుతం
సర్వాఙ్గీణ సదఙ్గరాగ సురభి శ్రీమద్వపు ర్ధూపితమ్।
తామ్బూలారుణ పల్లవాధరయుతం రమ్యం త్రిపుణ్డ్రం దధత్
భాలం నన్దన చన్దనేన జనని! ధ్యాయామి తే మఙ్గలమ్॥౨౯

ప్రతిపదార్థము:- జనని- తల్లీ, శృంగారాది-శృంగారము మొదలగు, రస-నవ రసములకు, ఆలయమ్- నివాసమైనదియు, అతుల్యైః- అసమానమైన, త్రి భువనైః- ముల్లోకములందు పుట్టిన, మాల్యైః- మాలికలచేత, యుతమ్- కూడినదియు, సర్వాంగీణ-శరీరమంతయు వ్యాపించిన, సదంగరాగ- మంచి గంధలేపముచే, సురభి- పరిమళభరితమైనదియు, ధూపితమ్- ధూపములు వేయబడినదియు అగు, తే- నీ, శ్రీమత్- శ్రీయుక్తమైన, వపుః- శరీరమును,

ధ్యాయామి- ధ్యానించెదను, తాంబూల- తాంబూలసేవచే, అరుణ- ఎఱ్ఱనైన, పల్లవాధరయుతమ్- చిగురాకువంటి పెదవిగలదియు, నందన- నందనవనము నందలి, చందనేన- మంచి గంధముచేత, రమ్యమ్- మనోహరమైన, త్రిపుండ్రమ్ -3రేఖలను, దధత్- ధరించిన, తే- నీ, మంగలమ్- కల్యాణప్రదమైన, భాలమ్- నుదురును, ధ్యాయామి- ధ్యానించెదను.

**తాత్పర్యము:** - తల్లీ, ముల్లోకములందలి మాలికలు దాల్చి సుగంధలేపనము లతో ధూపములతో అలరారుచు, నవరసమూలకందమైన నీ పుణ్యమంగళ విగ్రహమును ధ్యానించెదను. మఱియు, తాంబూలసేవనవలన ఎఱ్ఱనైన నీ అధరమును, నందనవన చందనముతో దిద్దిన త్రిపుండ్రములతో రమ్యమైన నీ 'ఫాలసీమ'ను ధ్యానించెదను.

**విశేషములు:** -

౧. 'నవవిద్రుమబింబశ్రీన్యక్కారిరదనచ్ఛదా', 'కర్పూరవీటికామోదసమాకర్ష ద్దిగంతరా', 'తాంబూలపూరితముఖీ', 'మూలకూటత్రయకళేబరా', 'శృంగార రససంపూర్ణా', 'చందనద్రవదిగ్ధాంగీ', 'త్ర్యక్షరీ దివ్యగంధాఢ్యా' అను ఈ శ్రీ లలితాసహస్ర నామముల సారాంశమే యీ శ్లోకమున సూచింపబడినది.

౨. సర్వాంగవర్ణన చేసినను తనివితీఱక చివఱగా దేవీ శరీరమును, దివ్యసుందర ముఖమును మఱల స్మరింపదలచుటయే ఈ శ్లోకమునకు ప్రేరణ.

3. త్రిభువనైః మాల్యైః అనగా ముల్లోకములు ఆమెకు మాలికలు అనియు చెప్పవచ్చును. తద్వారా దేవి విరాట్ స్వరూపమును వర్ణించినట్లు కాగలదు. 'సత్' అనగా పరమాత్మ. ఆయన అంశతోనే ప్రపంచమును దేవి సృజించినది. అనగా, **ప్రపంచము శివమయము.** కనుక విశ్వరూపమైన దేవికి విశ్వమే శరీరము. ఆ శరీరమునకు అంగరాగము అనగా, పైపూత శివతత్త్వమే. దేవికి అంగరాగము 'సత్' కనుక ఆమె శరీరము 'సదంగరాగసురభి' అన వచ్చును. దేవి 'శ్రీం' బీజ స్వరూపురాలు కనుక ఆమె శరీరమును 'శ్రీమత్' అనవచ్చును. త్రిలోకము లకు సూచనయే ఆమె నుదుటి 'త్రిపుండ్రము'. మొత్తముమీద ఈ శ్లోకమున

దేవియొక్క విశ్వరూపముతోబాటు ఆమె ముఖము వర్ణింపబడినది.

**అవతారిక:-** పరాశక్తి ధ్యానమునకు ఫలితము చెప్పుచున్నాడు.

శ్లో॥ ఏవం యః స్మరతి ప్రవృద్ధసుమతిః శ్రీమత్స్వరూపం పరం
వృద్ధోఽప్యాశు యువా భవత్యనుపమః స్త్రీణా మనఙ్గాయతే।
సోఽష్టైశ్వర్య తిరస్కృతాఖిల సురః శ్రీజృమ్భితాత్మాలయః
పృథ్వీపాల కిరీట కోటి వలభీ పుష్పార్చితాఙ్ఘ్రి ర్భవేత్॥ ४०

**ప్రతిపదార్థము:-** హే పరదేవతే- ఓ పరాశక్తీ, ఏవమ్-ఈ ప్రకారముగా, అనగా ఈ '39' శ్లోకములలో చెప్పిన విధముగా, ప్రవృద్ధసుమతిః- బుద్ధిమంతుడై, శ్రీమత్- శ్రీమంతమైన, పరమ్- అతీతమైన, స్వరూపమ్- నీ రూపమును, యః-ఎవడు, స్మరతి-స్మరించునో, సః-వాడు, వృద్ధోపి-ముసలివాడైనను, ఆశు - శీఘ్రముగా, అనుపమః-పోలికలేని, యువా-యువకుడుగా, భవతి-అగును, స్త్రీణామ్-స్త్రీలకు, అనంగాయతే-మన్మథుడువలె సుందరుడుగా అగుపించును. అష్టైశ్వర్య-8 విధములైన ఐశ్వర్యములచే, తిరస్కృత-తిరస్కరింపబడిన, అఖిల-సమస్తమైన, సురః-దేవతలు గలవాడును, శ్రీ-సంపదచేత, జృంభిత-వ్యాపింపబడిన, ఆత్మాలయః-తన యిల్లు గలవాడును, పృథ్వీపాల-రాజులయొక్క, కిరీటకోటి-కిరీటాగ్రముల యొక్క, వలభీ-క్రింది కోణములందలి, పుష్ప-పూలచే, అర్చిత-పూజింపబడిన, అంఘ్రిః-పాదములు గలవాడు, భవేత్-అగును.

**తాత్పర్యము:-** పరదేవతామంత్రమును పరాశక్తిని ఈ విధముగా స్తుతించినవాడు - ఎంతవృద్ధుడైనను- యువకుడు అగును. స్త్రీలకు అతడు నవమన్మథుడు అగును. వానికి అష్టైశ్వర్యములు లభించును. వాని యింట సంపదలు విజృంభించును. మహారాజుల కిరీట శిఖరములనుండి వాని పాదములపై పుష్పములు రాలును.

**విశేషములు:-**

౧. అష్టైశ్వర్యములు- దాసదాసీజనము, పుత్రులు, మిత్రులు, బన్ధువులు, వాహనము, ధనము, ధాన్యము=8

౨. తను గోరిన స్త్రీలకు, వలచిన వారికి వాడు మన్మథుడువలె కనబడును. ఇది పరస్త్రీల సంగతి కాదు. కన్యలు, మఱియు వేశ్యలు- ఇట్టి స్త్రీలసంగతి.

3. **అష్టైశ్వర్య తిరస్కృతాఖిల సురః** అనుటలో అష్టదిక్పాలకులు సూచింపబడినారు.

౪. 'సామ్రాజ్యదాయినీ సత్యసంధా సాగరమేఖలా' అను శ్రీలలితాసహస్ర నామములు ఇందులో సూచింపబడినవి.

**అవతారిక:** - దేవి యొక్క ధనుస్సును వర్ణించుచున్నాడు.

శ్లో॥ అథ తవ ధనుః పుణ్డ్రేక్షు(ం) కృ త్ప్రసిద్ధ మతి ద్యుతి
త్రిభువన వధూ ముద్య జ్జ్యోత్స్నా కలానిధి మణ్డలమ్।
సకల జనని స్మారం స్మారం గతః స్మరతాం నర
స్త్రిభువన వధూ మోహామ్భోధేః ప్రపూర్ణ విధు ర్భవేత్॥ ౪౧

**ప్రతిపదార్థము:** - హే సకల జనని- ఓ సర్వజననీ!, అథ- తరువాత, త్రిభువన- ముల్లోకములుఅనే, వధూమ్- స్త్రీగూర్చి, ఉద్యత్- ఉదయించుచున్న, జ్యోత్స్నా -వెన్నెలచేత, కలానిధి మండలమ్- చంద్రమండలము అని ప్రసిద్ధమ్- ప్రసిద్ధమైనదియు, అతిద్యుతి- మిక్కిలి కాంతిగలదియు, కృత్- కార్యశీలమైనదియు అగు, తవ- నీ, ధనుః పుండ్రేక్షుమ్- ధనుస్సు అనే చెఱకుగడను, స్మారం స్మారమ్- తలచి తలచి, స్మరతామ్- మన్మథ సౌందర్యమును, గతః- పొందిన, నరః- మానవుడు, త్రిభువన- ముల్లోకములందలి, వధూ- స్త్రీల యొక్క, మోహాంభోధేః- మోహ సముద్రమునకు, ప్రపూర్ణ- పూర్ణమైన, విధుః- చంద్రుడు, భవేత్- అగును.

**తాత్పర్యము:** - తల్లీ, నీ ధనుస్సు చెఱకుగడ. అది ముల్లోకములను ఆహ్లాద పఱచగల చంద్రమండలమే. ఆ ధనుస్సును స్మరించువాడు మన్మథుడై త్రిలోక స్త్రీలకు వ్యామోహసముద్రమును పొంగించు 'చంద్రు' డగును.

**విశేషములు:** -

౧. ఈ శ్లోకమున ప్రథమ పాదమున ఛందోభంగమైనది. 'పుండ్రేక్షుకృత్' వద్ద 'పుండ్రేక్షుం కృత్' అని మార్చి కొంత సరిచేయవచ్చును. దానివలన ఛందో

భంగము రాదు. అర్థము ఇంచుమించుగా సరిపోవును.

౨.దేవి చేతులలోని ఆయుధములు మన అంతఃకరణవృత్తులు. ఈ ధనుస్సు ఇక్షు ధనుస్సు. అనగా, కణుపులు కణుపులుగా నుండునది. ఇట్టిది మన శరీరము నందలి వెన్ను. దాని ద్వారా అందులోని సుషుమ్న మొదలగు నాడులు గ్రహింప బడును. సుషుమ్నయందు సర్వలోకములు సూక్ష్మరూపమున గలవని యోగ శాస్త్రము చెప్పుచున్నది. కనుక, ఈ ధనుస్సు ముల్లోకములను పొంగింప గల, ఆకర్షింపగల చంద్రమండలమును 'కృత్'చేయగలది అదే. అనగా, సహస్రారమున చంద్రమండల ప్రాదుర్భావమును చేయగలది ఈ ధనువే. '**మనో రూపేక్షుకోదండా**' అని శ్రీలలితాసహస్రనామము. మనస్సు స్థానము గూడా సుషుమ్నయందున్నది. అట్లు ఉదయించిన చంద్రమండలము ద్వారా త్రిభువన వధూ మోహసముద్రమునకు పూర్ణచంద్రుడు అనగా, మోహము అనునది చీకటి వంటిది. కనుక దానికి చంద్రుడు అనగా మోహమును పోగొట్టును. ఇది యోగ సమయముగా చెప్పును. '**తాపత్రయాగ్ని సంతప్తసమాహ్లాదన చంద్రికా**' అనునది శ్రీలలితాసహస్రనామము.

౪.45వశ్లోకమున 4ఆయుధముల ధ్యానముగూర్చి సంగ్రహముగా మఱల వర్ణించుచు ముని చాపధ్యానము వలన 'మోహనాశము' ఫలము అని చెప్పినాడు. కనుక 3 విశేషములో చెప్పినట్లు మోహమునకు నాశకరుడైన పూర్ణ చంద్రుడు అని అర్థమును సూచించుచుట సంగతమే. చూ॥ ౪౫వశ్లోకము.

౫. శివలోచనదగ్ధుడైన మన్మథుడు దేవీ ఉపాసనతోనే కాదివిద్యకు ఆచార్యుడై స్మరుడై త్రిలోకవిజయి అయ్యెను.

**అవతారిక:**- దేవీ శరములను స్తుతించుచున్నాడు.

శ్లో॥ ప్రసూన శర పఞ్చక ప్రకట జృమ్భణా గుమ్ఫితమ్
త్రిలోక మవలోకయ త్యమలచేతసా చిన్తయన్।
అశేషరమణీజన స్మర విజృమ్భణే యః సదా
పటు ర్భవతి తే శివే! త్రిజగదఙ్గనా క్షోభణే॥ ౪౨

**ప్రతిపదార్థము:-** శివే- శివశక్తీ, తే- నీ యొక్క, ప్రసూనశరపఞ్చక-5పుష్ప బాణముల యొక్క, ప్రకట-స్పష్టమైన, జృంభణా- విజృంభణచేత, గుమ్ఫితమ్ -వ్యాప్తమైన దానినిగా, త్రిలోకమ్- ముల్లోకములను, అమలచేతసా- నిర్మలమైన మనస్సుతో, చింతయన్- తలచుచు, యః-ఎవడు, అవలోకయతి- చూచునో, సః- వాడు, అశేష- సమస్త, రమణీజన- స్త్రీజనము యొక్క, స్మర- కాముని యొక్క, విజృంభణే- విజృంభించుట యందు, త్రిజగదంగనా- ముల్లోకపు స్త్రీల యొక్క, క్షోభణే- కలతపెట్టుటయందు, సదా- ఎల్లప్పుడు, పటుః- సమర్థుడు, భవతి- అగును.

**తాత్పర్యము:-** అమ్మా! నీ పంచపుష్పబాణములను వాటిచే వ్యాప్తమైన యీ ప్రపంచమును ధ్యానించిన వాడు త్రిలోకస్త్రీలకు విజేత కాగలడు.

**విశేషములు:-**

౧. 'పంచతన్మాత్రసాయకా' అని శ్రీలలితాసహస్రనామము. గంధము మొదలగు పంచభూతగుణములు ఇవి. ఈ ప్రపంచమంతయు పాంచభౌతికము. కనుక దేవీ శరములు ప్రపంచమంతయు విజృంభించినవని భావించవలయును.

౨. ఇవియే కాముని శరములు. కనుక ఇవి కామ సంకేతములు. ఉపాసకుడు కోరినచో ప్రపంచస్త్రీలను ముల్లోకములోని శక్తులను మనశరీరములోని శక్తులను గూడా వశపఱచికొనగలడు.

3. 'కమలం కైరవం రక్తకహ్లారేన్దీవరే తథా।
సహకార మితి ప్రోక్తం పుష్ప పంచక మీశ్వరి॥' - తంత్రరాజము

'కమలము, కలువ, ఎఱ్ఱకమలము, నల్లకలువ, మావిపూవు- పంచబాణములుగా పేర్కొనబడినవి.

౪. 'అరవిన్దమశోకం చ చూతం చ నవమల్లికా।
నీలోత్పలం చ పంచైతే పంచబాణస్యసాయకాః॥' - అమరము

'కమలము, అశోకము, మామిడి, సన్నజాజి, నల్లకలువ' - పంచబాణములుగా పేర్కొనబడినవి. ఇవి వరుసగా ద్రావణము, సందీపనము, సమ్మోహనము, కర్షణము, వశీకరణము చేయును.

**అవతారిక:**- దేవీ 'పాశము'ను స్తుతించుచున్నాడు.

శ్లో॥ పాశం ప్రపూరిత మహోసుమతి ప్రకాశో
యో వా తవ త్రిపురసున్దరి సున్దరీణామ్।
ఆకర్షణే ఽఖిల వశీకరణే ప్రవీణం
చిత్తే దధాతి స జగత్త్రయ వశ్యకృత్స్యాత్॥ ४३

**ప్రతిపదార్థము:**- త్రిపురసున్దరి- ఓ మహా త్రిపురసుందరీ!, యః- ఎవడు, ప్రపూరిత- పూర్ణమైన, మహా- గొప్ప, సుమతి- సుబుద్ధియొక్క, ప్రకాశః- వెలుగు గలవాడై, సుందరీణామ్- సుందరీమణుల యొక్క, ఆకర్షణే- ఆకర్షించుట యందు, అఖిల- అందఱియొక్క, వశీకరణే- వశము చేసికొనుట యందు, ప్రవీణమ్- నిపుణమైన, తవ- నీ, పాశమ్- పాశమును, చిత్తే- మనస్సునందు, దధాతి - ధరించునో, సః- వాడు, జగత్త్రయ- ముల్లోకముల యొక్క, వశ్యకృత్- వశము చేసికొనువాడు, స్యాత్- అగును.

**తాత్పర్యము:**- దేవి పూర్ణధ్యానముతో తత్పరుడైన సాధకుడు అఖిలవశంకరమైన నీ పాశమును ధ్యానించినచో సర్వసుందరీ సమ్మోహనుడు కాగలడు. ముల్లోకములు వానికి వశము అగును.

**విశేషములు:**-

౧.'రాగస్వరూపపాశాఢ్యా' అని శ్రీలలితాసహస్రనామము. కనుక, ఆమె పాశాయుధము 'రాగము'. దానిని సాధించిన వాడు సమస్తమును తన యందు 'రాగము' కలదానినిగా జేసికొనును.

౨. సుందరీవశీకరణము అని మఱల చెప్పినాడు. దేవి, త్రిపురసున్దరి. ఆ సందర్భమున సున్దరీమణులు అనగా దేవీశక్తులైన నవావరణశక్తులు గావచ్చును. వాటిని అన్నింటిని స్వాధీనము చేసికొనగలడు అని చెప్పదగును. ఏలననగా, షోడశీ సాధకుడైన వాడు దేవీస్వరూపమేయని చెప్పుచూ వాడు స్త్రీలను ఆకర్షించును అని చెప్పుట ఉదాత్తముగాలేదు. కనుక దేహగత త్రిలోకగత శక్తులే ఈ సుందరీమణులు అని భావించుట సందర్భశుద్ధిగా నుండును.

3.'55' శ్లోకమున 'విద్యాకలా యువతి మన్మథమూర్తి' అని దుర్వాసుడు చెప్పినాడు. దుర్వాసుడు మన్మథుడట. ఆయన ఆకర్షించు స్త్రీలు **విద్యలు కలలు** అనే యువతులు. కనుక, ఈ సుందరీమణులుగూడా అట్టి యువతులే కావలయును. అప్పుడు ఉదాత్తత లభించును. యక్షిణి మొదలగు ఉపాసనలు కలవు. ఆ విద్యలు కూడా ఇట్లే చెప్పవచ్చును.

**అవతారిక:**- దేవి చేతిలోని 'అంకుశ' ప్రభావమును వర్ణించుచున్నాడు.

శ్లో॥ యః స్వాన్తే కలయతి కోవిదః త్రిలోక
స్తమ్భారమ్భణ చణ మత్యుదార వీర్యమ్।
మాత స్తే విజయ మహాఙ్కుశం స యోషాః
దేవా న్స్తమ్భయతి చ భూభుజోఽన్య సైన్యమ్॥ ४४

**ప్రతిపదార్థము:**- మాతః-తల్లీ, యః-ఏ, కోవిదః-పండితుడు, త్రిలోక-ముల్లోకముల యొక్క, స్తంభారంభణ చణమ్-స్తంభింపజేయు నేర్పు గలదియు, అత్యుదార-మిక్కిలి యుదారమైన, వీర్యమ్-బలము కలదియగు, తే-నీ యొక్క, విజయ-జయప్రదమైన, మహాంకుశమ్-గొప్ప అంకుశమును, స్వాన్తే-మనస్సునందు, కలయతి-భావించునో, సః-వాడు, యోషా-స్త్రీలను, దేవాన్-దేవతలను, భూభుజః-రాజులను, అన్య-శత్రువులయొక్క, సైన్యమ్ చ-సేనను గూడా, స్తంభయతి-స్తంభింపజేయగలడు.

**తాత్పర్యము:**- దేవి అంకుశము 'క్రోధము'. దీనిని సాధనతో సొంతము చేసికొన్నవాడు 'తన' హుంకారముతోనే దుర్వాసునివలె దేవతలను రాజులను సేనలను స్త్రీలను స్తంభింపజేయగలడు.

విశేషము:-

'క్రోధాకారాంకుశోజ్జ్వలా' అని శ్రీలలితాసహస్రనామము.

**అవతారిక:**-4 ఆయుధముల ధ్యానమును ఫలితమును విశేషముగా చెప్పుచున్నాడు.

శ్లో॥ చాపధ్యానవశా ద్భవోద్భవ మహామోహస్య వ్యుజ్జృమ్భణం
ప్రఖ్యాతం ప్రసవేషు చిన్తనవశా త్తత్తచ్చరవ్యం సుధీః।

పాశధ్యానవశా త్సమస్త జగతాం మృత్యోర్వశత్వం మహో
దుర్గస్తమ్భ మహాఙ్కుశస్య మననా న్మాయయా మమేయాం తరేత్॥ ४३

ప్రతిపదార్థము:- మాతః- తల్లీ, సుధీః- బుద్ధిమంతుడైన సాధకుడు, చాపధ్యాన వశాత్- ఇక్షుచాప ధ్యానమువలన, భవోద్భవ- సంసారమునుండి పుట్టిన, మహా మోహస్య- అజ్ఞానముయొక్క, వ్యుజ్జృంభణమ్- విజృంభణ నాశమును, కరోతి- చేయును, ఇతి- అని, ప్రఖ్యాతమ్- ప్రసిద్ధమే, ప్రసవేషు- పుష్పబాణముల యొక్క, చింతన వశాత్- స్మరణ వలన, తత్తత్- ఆయా విషయములను, శరవ్యమ్- బాణ లక్ష్యములుగా, కరోతి- చేయును, పాశధ్యానవశాత్- పాశ ధ్యానము వలన, సమస్తజగతామ్- సమస్తలోకముల యొక్క, మృత్యోః- మృత్యువు యొక్క, వశత్వమ్- స్వాధీనతను పొందును, మహాదుర్గ- దుర్గమమైన, స్తంభ- స్తంభము చేయుగల, మహాంకుశస్య- అంకుశ మంత్రము యొక్క, మననాత్- మననముయొక్క, అమేయామ్- అప్రమేయమైన, మాయామ్- మాయను, తరేత్- దాటును.

**తాత్పర్యము:**- అమ్మా! నీ ఇక్షుకోదండ ధ్యానమువలన సాధకునకు మోహము తొలగును. పుష్పబాణరూపమైన 'తన్మాత్ర'ల మననమువలన విషయ నివారణము జరుగును. రాగస్వరూపమైన పాశమును స్మరించుటవలన, మృత్యువు తొలగిపోవును. క్రోధరూపమైన అంకుశమును ధ్యానించుటవలన ఉపాసకుడు మాయను దాటును.

**అవతారిక:**- పరదేవతతో తాదాత్మ్యమును కల్గించే న్యాసవిధానమును సూక్ష్మముగా చెప్పుచున్నాడు.

శ్లో॥ న్యాసం కృత్వా గణేశ గ్రహ భగణ మహాయోగినీ రాశిపీఠైః
పఞ్చాశ న్మాతృకార్ణైః సహిత బహుకలై రష్టవాగ్దేవతాభిః।
స శ్రీకణ్ఠాదియుగ్మై ర్నిజవిమలతనౌ కేశవాద్యైశ్చ తత్త్వైః
షట్త్రింశద్భి ర్ధరాద్యై ర్భగవతి! భవతీం యః స్మరేత్స త్వమేవ॥४४

**ప్రతిపదార్థము:**- భగవతి!- దేవీ, గణేశ- గణపతి, భగణ- నక్షత్రసమూహము,

మహాయోగినీ- యోగినులు, రాశి- రాశులు, పీఠైః- పీఠములు- వీనితో, సహిత బహుకలైః- కలలతోగూడిన, పంచాశత్-50 అయిన, మాతృకార్ణైః- మాతృకా వర్ణములతోను, అష్టవాగ్దేవతాభిః- 'వశిని'మొదలగు 8 వాగ్దేవతలతోను, శ్రీ కణ్ఠాదియుగ్మైః- శివశక్తులతోను, కేశవాద్యైః- కేశవుడు మొ॥ వారితోను, ధరాద్యైః- భూమి మొదలగు, షట్త్రింశద్భిః-36 అగు, తత్త్వైః చ- తత్త్వములచేతను, నిజ విమలతనౌ- తమ శరీరమునందు, న్యాసమ్- ఆవాహనను, కృత్వా-చేసి, యః- ఏ సాధకుడు, భవతీమ్- నిన్ను, స్మరేత్-స్మరించునో, సః- అతడు, త్వమేవ- నీవే.

**తాత్పర్యము:** - తల్లీ, గణపతి, గ్రహములు మొ॥దేవతలను, మాతృకావర్ణములను వాగ్దేవతలను, శివశక్తి మిథునమును, 36 తత్త్వములను, తన యందు ఆవాహన చేసికొని నిన్ను పూజించు సాధకుడు 'నీవు'గా అగును. దేవీస్వరూపుడగును.

**విశేషములు:** -

౧. అద్వైతపద్ధతిలో సాధకుడు దేవుడే అగును. అందుకుగాను న్యాసము ద్వారా దైవత్వము తనయందు **ఆవాహన** చేసికొనవలయును. 'నా శివః శివమర్చయేత్' అనగా శివుడు కానివాడు శివుని అర్చింపరాదు అని అర్థము. అందువలననే మహాన్యాసము పుట్టినది. అట్లే ప్రతి మంత్రమునకు అంగన్యాస కరన్యాసములు గలవు. వాటి ద్వారా మంత్రదేవతను మన యందు న్యాసముచేసి మంత్రదేవతా స్వరూపులమై ఉపాసన చేయవలయును. అట్లే శ్రీచక్రన్యాసము చేసికొని శ్రీ దేవతను అర్చింపవలయును.

౨. మంత్రరూపదేవతను తన శరీరమునందు ఆవాహన చేసికొనుట న్యాసము అనబడును. దీని వలన ఉపాసకుడు దేవతాస్వరూపు డగును. తాను, తన మంత్రము, ఉపాస్యదేవత అభిన్నులు అని భావించుట తంత్ర, ఆగమ, స్మార్త సంప్రదాయము. చూ॥

'యోన్యాం దేవతా ముపాస్తే అన్యోసావన్యో
హ మస్మీతి న స వేద యథా పశుః'

అనగా, దేవత వేఱని, తాను వేఱని, ఉపాసన చేయువాడు అజ్ఞాని. కనుక

శరీరావయవములపై మంత్రమును, శ్రీచక్రమును న్యాసము చేసికొనుట విధి.

**అవతారిక:**-పరదేవతోపాసకునకు ఐహికఫలము గలదు అని చెప్పుచున్నాడు.

శ్లో॥ సురపతిపురలక్ష్మీ జృమ్భణాతీతలక్ష్మీః
ప్రసరతి నిజగేహే యస్య దైవం త్వ మార్యే।
వివిధ బహుకలానాం పాత్రభూతస్య తస్య
త్రిభువన విదితా సా జృమ్భతే స్ఫూర్తి రచ్ఛా॥ ४८

ప్రతిపదార్థము:-ఆర్యే-పార్వతీ, యస్య-ఎవనికి, త్వమ్-నీవు, దైవమ్-దేవతవో, పాత్రభూతస్య-అర్హుడైన, తస్య-అతనియొక్క, నిజగేహే-స్వగృహమునందు, సురపతి పురలక్ష్మీ-స్వర్గలక్ష్మి యొక్క, జృమ్భణ-విజృంభణకన్న, అతీత-మించిన, లక్ష్మీః-సంపద, ప్రసరతి-ప్రసరించును, త్రిభువన-ముల్లోకము లందు, విదితా-ప్రసిద్ధమైన, వివిధ-అనేక విధములైన, బహు-అనేకములైన, కలానామ్-కలలయొక్క, సా-ఆ, స్ఫూర్తిః-స్ఫురణ, అచ్ఛా-స్వచ్ఛమైనదై, జృంభతే-విజృంభించును.

**తాత్పర్యము:**-అర్హుడైన నీ ఉపాసకునకు గృహమున స్వర్గమును మించిన సంపదలు; దేహమున స్వచ్ఛమైన సకలకలాస్ఫూర్తి లభించును.

విశేషములు:-

౧.'కలానిధిః కావ్యకలా రసజ్ఞా రసశేవధిః' అను శ్రీలలితాసహస్రనామము సూచితము.

౨.శ్రీలలితాసహస్రనామ ఫలితములో గూడా ఇట్లే చెప్పబడినది.

'లక్ష్మీః చాంచల్యరహితా సదా తిష్ఠతి తద్గృహే।
భారతీ తస్య జిహ్వాగ్రే రంగే నృత్యతి నిత్యశః॥'
'ముహ్యన్తి కామవశగాః మృగాక్ష్యః తస్య వీక్షణాత్'

3.పంచాక్షరీ మొదలగునవి ముక్తి విద్యలు. కాని, పంచదశి భుక్తి ముక్తి విద్య. ఇందలి బీజాక్షరములు సృష్టి సంహారములు రెండింటికి సంకేతము కనుక సృష్టిఖండము వలన భుక్తి, సంహారఖండము వలన ముక్తి కలుగును. కనుకనే,

రుద్రయామళ తంత్రములోని 'మంగళరాజస్తవము' లో

'యత్రాస్తి భోగో న తు తత్ర మోక్షః
యత్రాస్తి మోక్షో న తు తత్ర భోగః।
శ్రీ సున్దరీ సాధక పుంగవానామ్
భోగశ్చ మోక్షశ్చ కరస్థ ఏవ॥ - అని చెప్పబడినది.

బాలామంత్రమునందును త్రికూటములు సృష్టిక్రమమున ఒకసారి; సంహార క్రమమున మఱొకసారి జపించబడును. కనుక త్రికూటసారవిద్య అయిన యీ బాల గూడ భుక్తి ముక్తిప్రదయే.

**అవతారిక:** - ఈ శ్లోకము మానసార్చనను చెప్పుచున్నది. కాని యీ శ్లోకము సరిగాలేదు. శ్రీ నిత్యానందులు దీనిని వ్యాఖ్యానింపక వదిలినాడు. అయినను ఉన్నంతలో తెలుగు శ్రీ నీరాజన.

శ్లో॥ మాత స్త్వం భూర్భువః స్వర్మహరసి సుతను స్త్వన్తరిక్షేన్దుసూర్యై
రాత్మా శుక్రామరేన్ద్రైరపి నిగమ మహో బ్రహ్మభిః ప్రోతశక్తిః।
ప్రాణాపానాదియుక్తైః కలయతి సకలం మానసం ధ్యానయోగం
యేషాం తేషాం సపర్యా భవతి సురకృతా బ్రహ్మతా యోగినాం చ॥౪౮

**ప్రతిపదార్థము:** - మాతః- తల్లీ, సుతనుః- మంచి శరీరముగల, త్వమ్- నీవు, భూర్భువః స్వః మహః- భూలోక భువర్లోక సువర్లోక మహర్లోక స్వరూపమైన దానవు, అంతరిక్ష- ఆకాశముచేత, ఇందు- చంద్రునిచేత, సూర్యైః- సూర్యుని చేత, ప్రాణాపానాదియుక్తైః- ప్రాణ అపాన మొ॥ వాయువులతో గూడిన, శుక్ర అమరేంద్రైరపి- అగ్నితో, ఇంద్రునితో, దేవతలతోను, నిగమమహోబ్రహ్మభిః- వేదములచేతను, ఓంకారముచేతను, ప్రోతశక్తిః- అల్లుకుపోయిన శక్తిగల, ఆత్మా- ఆత్మవు నీవు, యేషామ్- ఎవరియొక్క, మానసమ్- మనస్సు, సకలమ్- పైన చెప్పిన సమస్తమును, ధ్యానయోగమ్- ధ్యానమే యోగమగునట్లుగా, కలయతి- గ్రహించునో, తేషామ్- వారికి, సురకృతా- దేవతలచే చేయబడిన, సపర్యా- సేవ, భవతి- అగును, యోగినామ్- యోగులకు, బ్రహ్మతా చ- బ్రహ్మత్వమున్ను,

భవతి-సిద్ధించును.

తాత్పర్యము:-దేవి సర్వలోకస్వరూపురాలు. త్రిఖండములు త్రిపురములు. అతీతకల త్రిపురాతీతము. త్రిపురములకు 'భూః భువః సువః' ప్రతీకలు. అతీత కలకు 'మహః' ప్రతీక. ఇది చతుష్పద గాయత్రికి, షోడశికి వర్ణనము. కాగా,

దేవీ, నీవు భూః మొదలగు లోకములు శరీరముగా గలదానవు. ఈ లోకములు ఈ శరీరము ఆకాశస్వరూపము. ఆ ఆకాశము సోమ సూర్య అగ్ని ఖండము. ఈ ఖండములన్నియు దేవతలతో వ్యాప్తమైనవి. వేదములు, ఓం కారముతోను ఈ కోశములు నిండియున్నవి. ప్రాణాపానాది వాయువులతో నడచునది. ఇట్టి నీ శరీరమును ధ్యానయోగమున ఎఱిగిన సాధకులకు ఇహలోకమున దేవతలు గూడా దాసులగుదురు. చివఱికి బ్రహ్మత్వము సిద్ధించును.

**విశేషములు:-**

౧. మహః అనునది 'శ్రీం' లేదా 'ఈం' అను గుప్తకలకు సంకేతము. అలాగే 'ఓం'లో నాదాంతమునకు గూడా సంకేతము కావచ్చును.

౨. లోకవిభాగమున ఒక తమాషా గలదు. భూఃలోకమును క్రిందకు '7'గా విభజింపవచ్చును. అతల వితల మొ॥ అధో లోకములు అవి. 'సువః'లోకము ను గూడా మహః జనః ఇత్యాదిగా విభజించెదరు. ఇవి ఊర్ధ్వ లోకములు. 'భువః' మాత్రము ఒక్కటిగా చెప్పెదరు. భువః అనగా అంతరిక్షము అనగా 'తారా పథము'.

3. శ్లోకములో 'అంతరిక్ష'పదముచే 'ఆకాశములు' సూచింపబడును. అవి ఏవి అనగా, 'ఆకాశ, మహాకాశ, పరాకాశ, తత్త్వాకాశ, సూర్యాకాశములు'. ఇవి 5. యోగశాస్త్ర రీత్యా మన 'సుషుమ్నా' నాడియందే గలవు.

౪. శుక్ర- అగ్ని అని అర్థము చెప్పవచ్చును. దీనివలననే అగ్ని ఖండము అర్థము వచ్చును. సోమసూర్య ఖండములు మాత్రమే వచ్చినచో వెలితి అగును.

**అవతారిక:-** శ్రీ దుర్వాసమహాముని తన మనస్సునున్న దానిని దేవి ముందు

వెల్లడిజేయుచున్నాడు.

శ్లో॥ క్వ మే బుద్ధి ర్వాచా పరమ విదుషో మందసరణిః
క్వ తే మాత ర్బ్రహ్మ ప్రముఖ విబుధస్యాప్త వచసామ్।
అభూ న్మే విస్ఫూర్తిః పరతర మహిమ్న స్తవ నుతిః
ప్రసిద్ధం క్షన్తవ్యం బహులతర చాపల్యమితి మే॥ ౪౯

**ప్రతిపదార్థము:-** మాతః-తల్లీ, పరమ్-మిక్కిలి, అవిదుషః-అపండితుడనైన, మే-నాయొక్క, మందసరణిః-మందగతియైన, బుద్ధిః-బుద్ధి, క్వ-ఎక్కడ, వాచా-వాక్కు, క్వ-ఎక్కడ, బ్రహ్మ-బ్రహ్మఅనే, ప్రముఖ-గొప్ప ముఖములు గల, విబుధస్య-పండితుని యొక్క, ఆప్తవచసామ్-ఆప్తవాక్యములైన వేదములకుగూడ, మందసరణిః-మందగతియైన, తే-నీ, నుతిః-స్తోత్రము, క్వ-ఎక్కడ, తవ-నీ యొక్క, పరతర-గొప్పదైన, మహిమ్నః-మహిమ వలన, మే-నాకు, విస్ఫూర్తిః-ఈ స్తోత్ర స్ఫురణ, అభూత్-అయ్యెను. మే-నా యొక్క, బహులతర-అధికతరమైన, చాపల్యమ్-చపలత్వము, ప్రసిద్ధం ఇతి-ప్రసిద్ధమే గదా అని, క్షంతవ్యమ్-క్షమింపదగినది.

**తాత్పర్యము:-** అమ్మా!, అపండితుడను నేను, నా బుద్ధి ఎంత? నా వాక్శక్తి ఎంత? నీ మహిమ అత్యంతశ్రేష్ఠము. బ్రహ్మవంటి మహాపండితుని వాక్కులైన వేదములే నీ మహిమ విషయములో మందముగా చులుకులేక మెల్లగా నడచును. అట్టి నీ మహిమ ఎక్కడ? నీ మహిమవలన నీ స్తోత్రము నాకు స్ఫురించినది. భక్తులకు ఇటువంటి చాపలము 'ప్రసిద్ధమేగదా' అని, నా చాపలమును మన్నింపుమని శ్రీదుర్వాసమహాముని దేవిని ప్రార్థించుచున్నాడు.

**విశేషములు:-**

ఈ శ్లోకము క్లిష్టాన్వయము. దీనిని మఱొకవిధముగా గూడా అన్వయక్రమముగా వ్యాఖ్యానింపవచ్చును. అప్పుడైనను భావమిదే వచ్చును. కనుక, సాధ్యమయినంత వఱకు సర్వ పదములనుపయోగించితిని. అధ్యాహారమును తప్పించితిని.

అధ్యాహారము అనగా అవసరమైన పదమును అప్పు తెచ్చుకొని అర్థము కుదుర్చుట. ఆ అవసరములేకుండగా ఉన్నపదములనే వినియోగించితిని.

**అవతారిక:** - అతః పరం సాధకమనోగతం దేవీం విజ్ఞాపయతి.

శ్లో॥ ప్రసీద పరదేవతే మమ హృది ప్రభూతం భయం
విదారయ దరిద్రతాం దలయ దేహి సర్వజ్ఞతామ్।
విధేహి కరుణానిధే! చరణపద్మయుగ్మం స్వయమ్
విదారిత జరామృతి త్రిపురసున్దరి శ్రీశివే! ॥ ౨౦

**ప్రతిపదార్థము:** - త్రిపురసుందరి- ఓ త్రిపురసుందరీదేవీ, శ్రీశివే- ఓ శివశక్తీ, పరదేవతే- ఓ పరదేవతా, ప్రసీద-ప్రసన్నురాలివి కమ్ము, మమ-నా, హృది- హృదయమునందు, ప్రభూతమ్- ప్రభవించిన, భయమ్- భయమును, విదారయ - చీల్చుము, దరిద్రతామ్- దారిద్ర్యమును, దలయ- బద్దలు చేయుము, సర్వజ్ఞతామ్- సర్వజ్ఞతను, దేహి- ఇమ్ము, కరుణానిధే- దయానిధీ, విదారిత- చీల్చబడిన, జరామృతి- జరామరణములుగల, చరణపద్మ- పాదాంబుజముల యొక్క, యుగ్మమ్- ద్వంద్వమును, స్వయమ్- స్వయముగా, విధేహి-చేయుము.

**తాత్పర్యము:** - అమ్మా!, త్రిపురసుందరీ, పరశివా!, అనుగ్రహదృష్టితో జూడుము, నా హృదయమునందలి భయమును పోగొట్టుము. దారిద్ర్యమును తొలగింపుము. సర్వజ్ఞతను ప్రసాదింపుము. నీ పాదపద్మములను నాకు స్వయముగా దయ సేయుము. నా జరామరణములను తొలగించి అమృతత్వము నిమ్ము,

**విశేషములు:** -

౧. వినాశయజరామృతీ అని పాఠాన్తరము గలదు. కవితారీత్యా అది బాగున్నది. ఎందువలననో సంస్కృతవ్యాఖ్యాత దానిని పరిగ్రహింపలేదు. బహుశః వారికి ఆ పాఠము దొరకియుండక పోవచ్చును.

౨. 'స్వయం' - స్వయముగా అని ఒక అర్థము. దీని వలన భక్తుని అశక్తత, దేవి మార్జాలన్యాయమున తల్లివలె, పిల్లివలె, తల్లిపిల్లివలె స్వయముగా తన చరణము

లను అందించునని కవి ఆశయము.

3. అయః-శుభావహమైన విధి అని అర్థము. అట్టిచో స్వయం అనగా మంచి శుభములు గలిగించునదిగా చేయుము అని అర్థము వచ్చును. దేవీ ఉపాసకుల నిరంతర మనన శ్లోకము ఒకటి గలదు. అది పూజాన్తమున చదివెదరు. ఈ శ్లోకము మా గురువుగారు శ్రీ తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రి వారి ముఖతః రోజూ పూజాన్తమున వినెడివాడను. చూ॥

'పాతయ వా పాతాళే
స్థాపయ వా సకలలోకసామ్రాజ్యే।
మాతః త్వచ్చరణం
నాహం ముంచామి నైవ ముంచామి॥'

భావము-'తల్లీ, నీ పాదాంబుజములను పట్టుకొంటిని. పాతాళమునకు త్రొక్కినా సరే!, సర్వసామ్రాజ్యమున అనగా నీ సాయుజ్యమున నిలిపినను సరే, నేను మాత్రము నీ పాదములను వదలను.'

4. పాదములు అనగా నేవి? దేవి శ్రీ మాత, శ్రీ గురువు. గురు పాదములు '2' గలవు. అవి ఆజ్ఞనుంచి మూలాధారము వఱకు సాగినవి. స్థూల సూక్ష్మ కారణ శరీరములదాకా వ్యాపించినవి. రక్త శుక్ల ప్రభామిశ్రములు. చూ॥

'వన్దే గురుపదద్వంద్వం అవాఙ్మానసగోచరమ్।
రక్త శుక్ల ప్రభామిశ్రం అతర్క్యం త్రైపురం మహః॥'

అట్టి గురు పాదములే యీ చరణద్వంద్వము.

5. '54' శ్లోకములో బ్రహ్మపారం పరతరచరణకారమ్ అనుటయు ఇందుకు స్ఫోరకము.

6. దుర్వాసుడు 'దేవి'ని 24వ శ్లోకమున గురువుగా భావించుట ఇచట గమనింపగలరు.

శ్లో॥ ఇతి త్రిపురసున్దరీ స్తుతి మిమాం పఠేద్యః సుధీః
స సర్వదురితాటవీ పటల చణ్డ దావానలః॥

భవే న్మనసి వాఞ్ఛితం ప్రచుర సిద్ధి బుద్ధి ర్భవే
దనేకవిధ సంపదాం పద మనన్యతుల్యో భవేత్॥ ౫౧

**ప్రతిపదార్థము:**- ఇతి- ఈ విధముగా, ఇమామ్- ఈ, త్రిపురసుందరీ- త్రిపురాదేవి యొక్క, స్తుతిమ్- స్తోత్రమును, యః- ఏ, సుధీః- విద్వాంసుడు, పఠేత్- చదువునో, సః- ఆ విద్వాంసుడు, సర్వదురిత- సమస్తపాపములు అనే, అటవీ పటల- అరణ్యసమూహమునకు, చండ- ప్రచండమైన, దావానలః- దావాగ్నిగా, భవేత్- అగును, ప్రచుర- అనేకములైన, సిద్ధి- సిద్ధులయొక్క, బుద్ధిః -సమృద్ధి, భవేత్- అగును, అనేకవిధ- బహువిధములైన, సంపదామ్- సంపదల యొక్క, పదమ్- స్థానము, భవేత్- అగును, అనన్యతుల్యః- అసమానుడు, భవేత్.

**తాత్పర్యము:**- ఈ స్తోత్రమును పఠించిన వానికి సర్వపాపారణ్యములు దహించుకొని పోవును. వాంఛలు సిద్ధించును. సిద్ధులు సమకూరును. అనేక సంపదలకు అతడే అర్హుడగును. అసాధారణవ్యక్తి అగును.

శ్లో॥ సఙ్గీతం సరసం విచిత్రకవితా మామ్నాయ వాక్యస్మృతిమ్
వ్యాఖ్యానం హృది తావకీన చరణద్వన్ద్వం చ సర్వజ్ఞతామ్।
శ్రద్ధాం కర్మణి శామ్భవేతి విపులం శ్రీజృమ్భణం మన్దిరే
సౌన్దర్యం వపుషి ప్రదేహి జగతా మమ్బేశ్వరి శ్రీశివే॥ ౫౨

**ప్రతిపదార్థము:**- జగతాం అంబ- జగదంబా, ఈశ్వరి- గౌరీ, శ్రీశివే- ఓ శివ శక్తీ, సరసమ్- సరసమైన, సంగీతమ్- సంగీతమును, విచిత్ర కవితామ్- చిత్ర కవితలను, ఆమ్నాయ- మంత్ర,వేదముల యొక్క, వాక్య- వాక్యముల యొక్క, స్మృతి- స్మృతుల యొక్క, వ్యాఖ్యానమ్- వివరణాత్మక జ్ఞానమును, హృది- హృదయమునందు,తావకీన- నీదైన, చరణద్వంద్వం చ- పాదద్వయమును, సర్వజ్ఞతామ్- సర్వజ్ఞతను, శాంభవే- శివసంబంధమైన, కర్మణి- కర్మయందు, శ్రద్ధామ్- శ్రద్ధను, మందిరే- గృహమున, అతివిపులమ్- అధికమైన, శ్రీజృమ్భణం -సంపదల విజృంభణను, వపుషి- శరీరమున, సౌన్దర్యమ్- అన్దమును, ప్రదేహి.

**తాత్పర్యము:**- దేవీ, సరససంగీతమును విచిత్రకవితను, వేదవాక్య వ్యాఖ్యానము

ను, హృదయమున నీ పాదపద్మ స్మరణను, సర్వజ్ఞతను, శంభుసేవను, మహో గృహసంపదలను సౌందర్యమును దయ చేయుము.

**అవతారిక:**-'మహిమ్నః స్తోత్ర'పఠనము చేసిన వారికి కలుగు ఐహిక ఫలములు చెప్పుచున్నాడు.

శ్లో॥ పృథ్వీపాల ప్రకట ముకుట స్రగ్రజో రఞ్జితాఙ్ఘ్రి
ర్విద్వ త్పూజా స్తుతిశత సమారాధితో బాధితారిః।
విద్యాః సర్వాః కలయతి హృదా వ్యాకరోతి ప్రవాచా
లోకాశ్చర్యై ర్నవ నవపదై రిన్దుబిమ్బ ప్రకాశైః॥

**ప్రతిపదార్థము:**-హే మాతః-తల్లీ, పృథ్వీపాల-రాజులయొక్క, ప్రకట-స్పష్టమైన, ముకుట-కిరీటములందలి, స్రక్-పూలదండయొక్క, రజః-పరాగముచేత రంజిత-రంగువేయబడిన, అంఘ్రిః-చరణములు గలవాడును, విద్వత్పూజా--పండిత పూజలచే, స్తుతిశత-శతస్తోత్రముల చేత, ఆరాధితః-పూజింపబడిన వాడై, బాధితారిః-బాధింపబడిన శత్రువులు గలవాడై, హృదా-మనస్సుతో, సర్వాః-సమస్తమైన, విద్యాః-విద్యలను, కలయతి-గ్రహించును, ప్రవాచా-గొప్ప వాక్యముతో, లోకాశ్చర్యైః-లోకాశ్చర్యకరములైనవియు, ఇందుబింబప్రకాశైః-చంద్రబింబమువంటి, నవ నవ-క్రొత్త క్రొత్త, పదైః-పదములతోను, వ్యాకరోతి-విద్యలను వ్యాఖ్యానించును.

**తాత్పర్యము:**-ఈ స్తోత్ర పాఠకుడు జ్ఞానపూర్వకమైన పూజతో నిన్ను పూజించును. వీనిని పండితులే పూజించి స్తుతించెదరు. శత్రుబాధ లేదు. సర్వ విద్యలు అతనికి కరతలామలకము. ఏ విషయములనైనను అతడు జ్ఞాన నిర్మలమైన పదములతో వ్యాఖ్యానించును.

శ్లో॥ భూష్యం వైదుష్య ముద్యద్దినకర కిరణాకార మాకారతేజః
సుజ్ఞానం భూరిమార్గం నిగమనిగమనం దుర్గమం యోగమార్గమ్।
ఆయుష్యం బ్రహ్మపోష్యం హరగిరివిశదాం కీర్తి మభ్యేత్య భూమౌ
దేహాన్తే బ్రహ్మపారం పరతర చరణాకార మభ్యేతి విద్వాన్॥ ౨౪

ప్రతిపదార్థము:-విద్వాన్-సాధకుడు, లేదా పండితుడు, భూష్యమ్-గౌరవింప దగిన, వైదుష్యమ్-పాండిత్యమును, ఉద్యత్-ఉదయించు, దినకర-సూర్యుని యొక్క, కిరణాకారమ్-కిరణముల ఆకారమువంటి ఆకారముగల, ఆకార తేజః-శరీరకాంతిని, సుజ్ఞానమ్-సుగమవుగా, భూరిమార్గమ్-బహు మార్గములుగల, నిగమ-వేదముల యొక్క, నిగమనమ్-వ్యాఖ్యానము చేయు శక్తి, దుర్గమమ్-దుర్లభమైన, యోగమార్గమ్-యోగమార్గమును, బ్రహ్మపోష్యమ్ -బ్రహ్మచే పోషింపదగిన, ఆయుష్యమ్-ఆయుర్దాయమును, హరగిరి-కైలాసమువలె, విశదామ్-నిర్మలమైన, కీర్తిమ్-కీర్తిని, భూమౌ-భూమియందు, అభ్యేత్య-పొంది, దేహాన్తే-శరీరావసానమున, పరతర-లోకాతీతమైన, చరణాకారం -పాదస్వరూపమైన, బ్రహ్మపారమ్-పరబ్రహ్మను, అభ్యేతి-పొందును.

**తాత్పర్యము:**-ఈ స్తోత్రపాఠకునకు, పాండిత్యము ఉదయారుణకాంతి, వేద వ్యాఖ్యాననైపుణ్యము, యోగమార్గవిజయము, బ్రహ్మాయుర్దాయము, శుభ్రమైన కీర్తి ఇహలోకమున లభించును. పరమున గురుపాదుకాకారమైన పరబ్రహ్మతో ఐక్యము లభించును.

**అవతారిక:**-దుర్వాసమహాముని తన పేరుతో 'స్తోత్రము'ను ముగించు చున్నాడు.

శ్లో॥ దుర్వాససా విదిత తత్త్వమునీశ్వరేణ
విద్యాకలాయువతి మన్మథమూర్తి నైతత్।
స్తోత్రం వ్యధాయి రుచిరం త్రిపురామ్బికాయాః
వేదాగమోక్త పటలై ర్విదితైక మూర్తిః॥ ౫౫॥

ప్రతిపదార్థము:-విద్యా-మంత్రవిద్యలు, కలా-కలలు అనే, యువతి-యువతు లకు, మన్మథమూర్తినా-మన్మథునివంటి వాడును, విదితతత్త్వ-తత్త్వవేత్తలైన, ముని-మునులకు, ఈశ్వరేణ-ప్రభువు అయిన వాడును అగు, దుర్వాససా-దుర్వాసునిచేత, వేద-వేదములందు, ఆగమ-ఆగమశాస్త్రములందు, ఉక్త-చెప్ప బడిన, పటలైః -అధ్యాయములచే, విదితైకమూర్తిః-తెలుపబడిన ఏకైకదైవతమైన,

త్రిపుర అంబికాయాః- త్రిపురేశ్వరి యొక్క, స్తోత్రమ్- స్తోత్రము, రుచిరమ్- అందముగా, వ్యధాయి- చేయబడెను.

తాత్పర్యము:- మంత్రవిద్యలు, చతుష్షష్టికలలు, యువతులుగా, యోగినులుగా, శ్రీసుందరీమణులుగా చెప్పబడిరి. అట్టి యువతులను ఆకర్షింపగల మన్మథుడు ఈ దుర్వాసుడు. దుర్వాసుడు అనగా కష్టమైన వస్త్రములు గల వాడు. జనుపనారతో చేసిన నారచీరలు, పులితోలు, మొ॥ వస్త్రములు ఇవియే. ఇట్టి వస్త్రధారణచేసినవాడే విద్యాకలాయువతులకు మన్మథుడు కాగలడు. ఈ స్తోత్రము దుర్వాసునిచే రచింపబడినది.

శ్లో॥ సదసదనుగ్రహ నిగ్రహ గృహీత ముని విగ్రహో భగవాన్।
సర్వాసా ముపనిషదాం దుర్వాసా జయతి దేశికః ప్రథమః॥ ౫౯

ప్రతిపదార్థము:- సత్- సత్పురుషుల యొక్క, అసత్- దుష్టుల యొక్క, అనుగ్రహ- అనుగ్రహించుట కొఱకు, నిగ్రహ- నిగ్రహించుట కొఱకు, గృహీత -స్వీకరింపబడిన, విగ్రహః- శరీరము గలవాడును, భగవాన్- దివ్యదర్శనుడైన, దుర్వాసాః- దుర్వాసమహర్షి, సర్వాసామ్- సమస్తమైన, ఉపనిషదామ్- ఉపనిషత్తుల యొక్క, ప్రథమః- మొదటి, దేశికః- ఆచార్యుడుగా, జయతి- వెలుగుచున్నాడు.

**తాత్పర్యము:**- మంచిని అనుగ్రహించుటకు, చెడును నిగ్రహించుటకు శరీరముతో అవతరించిన క్రోధభట్టారకుడైన దుర్వాసుడు శ్రీవిద్యాగురువు లలో ఉత్తముడు.

**శ్రీనీరాజన నివేదనము**

'శ్రీనీరాజన పట్టినాడనిదిగో! శ్రీదేవి! నీ యిచ్చయే,
యీ నాపై నికనున్నచో మఱల నేదే స్నీవు వ్రాయింపవా?
ఓ నాతల్లి! సమస్తజీవులకు నేదో బంధమిట్లుంచు చీ
'నీనా' ల'న్మన' జేయు మాతవు భవానీ!మోహనాంగీ! నమః.

ఇతి శ్రీదుర్వాసమునీంద్రేణ విరచితం శ్రీత్రిపురామహిమ్నః స్తోత్రం సంపూర్ణమ్

ఇది మేళ్లచెర్వు వేఙ్కట సుబ్రహ్మణ్యశాస్త్రి విరచిత శ్రీనీరాజన యను ఆంధ్ర వ్యాఖ్య సమాప్తము

శ్రీః

98

త్వరలో

శ్రీవైష్ణవాచార్యులు 'ప్రతివాదభయంకరం అణ్ణన్'

విరచితమైన

# శ్రీరఙ్గనాథసుప్రభాతము, ప్రపత్తి మంగళాశాసనము

శ్రీ ఈ. ఏ. శింగరాచార్యుల 'శ్రీః' వ్యాఖ్య

(అర్థ తాత్పర్య వివరణ)తో

వెలువడుతుంది



సాధన గ్రంథ మండలి, తెనాలి

